# ప్లసీ

ఇంట్లో ఎలుకల గోల ఎక్కువైంది.

దీన్ని ఆధారం చేసుకుని ఇంటావిడ చేసే గోల ఇంకా ఎక్కువైంది — ఈ తప్పంతా నాదే నన్నట్టు! వేళా లేదు, పాళా లేదు చాముండీవలె నా మీదికి వచ్చేది!

"వీటి సంగతి ఏమన్నా ఆలోచిస్తారా, ఉరిపెట్టుకు చావమంటారా?"

"ఇల్లు వదిలిపెట్టి వెయ్యాలి. అంతకంటె నావల్ల ఏమవుతుందో చెప్పు?" అన్నాను.

"ఆఁ. ఎందుకొదలరు. ఈ వీధిలో నాకు నలుగురైదుగురు స్నేహితురాండ్రు దొరికిరి; మీ కళ్లు ఓర్వస్తాయా?"

కొంప ముంచి నామీదికే తిప్పింది!

"అయితే ఏమి చేయమంటావో, చెప్పు."

"ఊళ్లో రెండు పూటలూ తిరగటానికి పోతూ ఉంటారు కదా, ఎలికబోను ఒకటి పట్టుకు రాకూడదూ?"

మర్నాడు పనులన్నీ మానుకుని, మంచిది చూసి ఒక బోను తెచ్చాను. జర్మనీలో చేసింది! దాన్ని ఎలా ఉపయోగించాల్సిందీ దుకాణదారు నాకు తెలియజెప్పాడు:

"ఇది ఎలికా, ఇది ఎరా అనుకోండి" అని అతని చేతిలో ఉన్న పెన్సిలు, నేను ఎలిక అనుకున్నది. ఎరమీద పెట్టి వత్తగానే "ఠాప్" అని బోను మూసుకుపోయింది. ఎంత లాగినా పెన్సిలు రాలేదు.

"ఎంత పెద్ద ఎలికైనా కీచుమనకుండా చచ్చి ఊరుకుంటుంది, తీసుకుపోండి" అన్నాడు దుకాణదారు.

బోను తీసుకుని ఆనందంతో ఇంటికి వచ్చాను.

మహా ఉత్సాహంతోనూ, చాలా జాగ్రత్తగానూ బోను మీద ఎరపెట్టి, ఆ రాత్రి దాన్ని వంట ఇంట్లో పెట్టి మా ఆవిడతో "ఇంకేం! బాధ తప్పినట్టేగా?" అన్నాను.

"కాని దాని మోతకు అన్నీ పారిపోతాయి. ప్రతి దఫా చచ్చినదాన్ని పారవేసి మళ్ళీ బోనును అమరుస్తూ ఉండాలి. నాకు వాటిని అంటుకోవటం అంటే బలే భయం బాబూ!" అన్నది.

"సరే, నేను చూస్తాను" అన్నాను.

ఎలిక ఎప్పుడు పడుతుందోనని కాచుకుని ఉండటంవల్ల నాకు ఆ రాత్రంతా కంటిమీద కునుకులేదు. ఎక్కడకాస్త "టుప్"మని చప్పుడైనా లేచి పరిగెత్తేవాడిని. ఎలికా లేదు, ఏమీ లేదు! ఎట్లా పెట్టిన బోను అట్లాగేఉండేది.

తెల్లవారి లేచి చూశాము. ఎలికలు రోజుటిమాదిరిగా నేసామాను పాడుచేసినవి. కాని ఒక్కటికూడా బోనులో పడలేదు. కనీసం దాని దగ్గరగా పోయిన జాడకూడా కనపడలేదు.

"ఉహుఁ. ఈ బోనుతో లాభంలేదు. బస్తీ ఎలికలు కాదూ; మాంచి జిత్తులమారివి! మా పల్లెటూరి ఎలికలైతే అన్నీ పడేవి! అంతకంటే, ఇంకో పనిచెయండి. పిల్లిని పట్టుకురండి, పెంచుకుందాము" అన్నది మా ఆవిడ.

"అలాగే!" అన్నాను.

ఆనాటినుంచీ పిల్లికోసం తిరుగుతున్నాను. దోవలో ఎక్కడ పిల్లి కనపడ్డా ఆగేవాణ్ణి. పట్టుకోబోతే అది పారి పోయేది ఆఖరికి విసుగుపుట్టి, పెద్దవి చిక్కవనీ, ఎక్కడైనా చిన్నది ఒకటి దొరికితే పెంచుకుందామని తేల్చుకున్నాను. కాని పిల్లికూన ఎక్కడ దొరుకుతుంది?

అదృష్టం బాగుండి, ఓ పిల్లికూన త్వరలోనే దొరికింది.

ఒకనాడు నేను ట్రాము ఎక్కి వస్తూ ఉండగా పాకీ డబ్బా దగ్గర 'కుంయ్, కుంయ్' అని అరుస్తున్నది. బహుశా తిండి కోసం వెతుకుతున్న దనుకుంటాను. నేను వెంటనే ట్రాము దిగి ఆ బేవారసు పిల్లి కూనను ఇంటికి తెచ్చాను.

పిల్లికూన మా ఇంట్లోనే పెరగ నారంభించింది. పాలు తాగేది; మాంసం తినేది: 'మ్యావ్, మ్యావ్' అంటూ ఆ గదిలోకీ తిరిగేది; గంతులేస్తూ చెల్లాటలాడేది. ఈ గదిలోకీ ఎవరితోనైనా మాట్లాడుతూ ఉంటే నా ఒళ్లోకి వచ్చి దూరేది. రాత్రిపూట నాకు తెలియకుండానే వచ్చి పక్కలో కరుచుకు పండుకునేది.

నాకు చీదర వేసేదికాదు. బహుశా పిల్లికూనను ప్రేమిం చాననుకుంటాను. ఇంట్లో పిల్లా జల్లా లేరు, ఒకనాడు మా పక్క ఇంటిఆవిడ నవ్వుతూ మా ఆవిడతో ఇలా అనటం విన్నాను: "పిల్లా జల్లాలేరని ఆఖరికి పిల్లిని పెంచు కున్నారా?"

అనుకుంటే మానె అనుకున్నాను. పాపం, నేను తీసుకు రాకపోతే ఇదివరకు ఏ గుర్రపు బండి కిందో, మోటారు కిందో పడి చచ్చేది. నేను తేవటమే మంచిదయింది.

కాని అది ఎలికలు పట్టటానికి ఇంకా చాలాకాలం పోవాలి. అది ఇంకా బొద్దింకను చూస్తేనే భయంతో పారి పోతున్నది. ఎక్కడైనా చప్పుడైతే రంయ్యిన వచ్చి నాదగ్గర దాక్కునేది.

దానికి ప్రేమతో 'పుసీ' అని పేరుపెట్టాను.

పుసీమీద మా ఆవిడకు క్రమంగా అయిష్టత కలగ నారంభించింది. నేను దాన్ని తెచ్చిన కొత్తలో మా ఆవిడ పుసీని ఎత్తుకుని ముద్దులాడటం చూశాను. కాని, అది పెద్ద దవుతున్నకుందికి, దానిమీద కత్తికట్ట నారంభించింది.

''బాబో, ఇది వద్దండి, తెచ్చినచోటే పారేసిరండి. మనుషు లెక్కడన్నా పిల్లుల్ని పెంచుతారూ! ఛీ!'' అన్నది.

''ఎందుకని? ఏమి చేసిందేమిటి?'' అని అడిగాను.

''నా శ్రాద్ధం! ఎప్పుడో ఎలికల్ని పట్టుతుందని ఇప్పటి నుంచీ రాజకూతుర్ని పెంచినట్టు పెంచటం ఎందుకు? చూడండి, ఏమి చేసిందో!'' అని తన చెయ్యి నా కంటి ముందుపెట్టింది. పచ్చటి చేతిమీద ఎర్రటి గీతలు పొంగి ఉన్నాయి.

''దెబ్బ కొట్టిందా ఏమిటి?''

''చొంగ కారుస్తూ ప్రతి చట్టిలోనూ మూతి పెట్టుతుంది. పిల్లి వెంట్రుక గనక కడుపులోకి పోతే ఏమి వస్తుందో తెలుసునా? ఆ యింటావిడ చెప్పింది - క్షయట!''

''ఏమీ రాదు...దాన్ని కాస్త ఆదరిస్తూ ఉండు, నీ జోలికి రాదు. ఏదీ! నన్ను ఒక్కమాటూ కొట్టలేదేం?'' అన్నాను.

"ఆదరించటం కాదు, నిప్పు పెడతాను! ఈ మధ్య దొంగతనంగా తింటంకూడా నేర్చుకున్నది. దీనికంటె ఎలికలే నయమనిపించాయి. త్వరగా వదిలించండి ఈ పీడని!"

కాని నేను దాన్ని వదిలించుకోలేదు. వెళ్లగొట్టటం అనేవరకు నా మనస్సులో ఎలాగో ఉండేది.

అటు మా ఆవిడ దాన్ని కొట్టటం సాగించింది. ఒకనాడు కాళ్ళ దగ్గరకు వచ్చి నుంచున్న పుసీని మా ఆవిడ ఝాడించి తన్నింది. పాపం, ఆ తన్నుకు అది 'క్యావ్'మని గోడ మీదకు పోయిపడింది.

దానిని ఇలా తన్నటం, చీపురుకట్టతో కొట్టటం, రాత్రిం బగళ్ళూ తిట్టటం, ఆవిడకు పరిపాటి అయిపోయింది. అప్పు డప్పుడూ — "ఇంకా వెళ్ళగొట్టలేదు కదూ! చూడండి, ఎప్పుడో ఒకప్పుడు అది నా చేతిలో చావకపోతే" అని అంటూ ఉండేది.

వెళ్ళగొట్టే ప్రయత్నం మా ఆవిడ చేయలేదనుకుంటా రేమో? చేసింది! నేను లేనప్పుడు ఒకమాటు ఇంట్లోనుంచి వెళ్లగొట్టి తలుపు వేసిందట. ఇంకోమాటు అంట్లు తోమే దానిచేత ఎక్కడో వదిలిపెట్టించిందట. కాని పుసీ 'మ్యావ్, మ్యావ్' అని ఏడ్చుకుంటూ తిరిగి వచ్చిందట. ఇక దాన్ని ఆవిడ పెట్టే బాధలు అంతు లేవు. నేను ఆఫీసుకు పోగానే ఆలమారా పైకి ఎక్కించేదట. పాపం, అది అక్కడనుంచి దూకటానికి భయపడేది. కడుపులో మాడటంచేత 'మ్యావ్, మ్యావ్' అంటూ జాలిగా చూచేది!

నేను ఒక పనిమీద ఇల్లు వదలి పెట్టవలసి వచ్చింది.

ఈ మధ్య మాంసం ముక్క దొంగిలించిందని ఆ రెండు రోజులూ ఆవిడ దానికి తిండి పెట్టలేదట! ఈ సంగతి తెలిసి నాకు కోపం వచ్చి అన్నాను.

"ఈ రెండు రోజులనుంచీ ఏమీ పెట్టనే లేదా?"

"చాద స్తమా ఏమిటి మీకు? అది తినకుండా ఉంటుం దంటే నమ్మారూ? దొంగతనంగా చట్టెడు కూరా తిన్నది!"

ఏవిధంగా అయితేనేం? పుసీ బతుకుతున్నది. పెద్దది కావటానికి ఎంతకాలంపడుతుంది!

నాలుగుమాసాల్లో పుసీ పెద్దదయింది. గుర్తుపట్టటానికి కూడా వీలులేకుండాపోయింది. ఇంకా అది నాకంచం దగ్గరే తింటున్నది; నాదగ్గరే కూర్చుంటున్నది; కాని పొద్దుగూకితే కనపడేదికాదు. పుసీకి మేనత్తకాదూ, ఎక్కడికి వేటాడ టానికి పోయేదో?

ఇప్పుడు ఎలికలు దీనిభయంచేత మాఇంట్లోకి రావటం లేదు. అయినా నాభార్యకు సంతృప్తికలగలేదు. వాటికంటే ఇదే ఎక్కువ నష్టపెడుతున్న దట! ఇది చస్తేగాని శని వదలదట! ఇంటికి ఎవరన్నా రావటం భయం—"ఏమమ్మా పిల్లులు ఎంతకాలం బతుకుతాయి?" అని అడిగేది.

కొందరు ఆరుమాసాలనీ, కొందరు సంవత్సరమనీ చెప్పే వారు. ఒకావిడ—'ఎక్కడమ్మా! నేను పిల్లి చావటం ఎప్పుడూ చూడలేదే?" అన్నది.

ఇప్పుడు వెనకటిమాదిరిగా పుసీని కొట్టటానికి ఆవిడకు వీలుచిక్కటంలేదు. చీపురుఎత్తేవరకు అది గంతేసి పారి పోతున్నది. పట్టుకోపోతే 'ఫుస్, ఫుస్' అని గురకపెట్టేది.

పంజాతో కొట్టుతుందేమోనని మా ఆవిడ దగ్గరకుపోయేది కాదు; ఎడంగా ఉండే శాపనార్థాలు పెట్టేది.

"ఈశని మామూలాన్నే దాపురించింది. చస్తున్నాను, దీనిపోరుపడలేక" అన్నది ఒకనాడు మా ఆవిడ.

జవాబు చెప్పటానికి భయమేసింది. మాట్లాడకుండా ఊరుకున్నాను.

"రెండుమూడురోజులనుంచిపుసీకనపడటంలేదు. చాలా చోట్ల వెతికాను. ఎక్కడికిపోయినట్టు ?"

"అబ్బ, ఎంతకాలానికి వదిలిందిపీడ! నాకడుపు చల్లబడింది. రోడ్డుమీద షికారు చేయటానికి పోయిందిగామాలు, బండికిందపడి నిక్కిఉంటుంది!" అన్నది మాఆవిడ నవ్వుతూ.

కాని నాకేమీ సంతోషం కలగలేదు! అన్నందగ్గర కూర్చుని, రాదని తెలిసికూడా 'పుసీ, పుసీ' అని పిలిచాను. నాకు అన్నం సహించలేదు.

"అది మీకు బిడ్డా, పాపా–దానికోసం దిగులుపడటానికి!" అన్నది మా ఆవిడ తిరస్కారంగా.

రాత్రి బాగా నిద్రపట్టలేదు. మళ్ళీ పుసీని ఇంటికివచ్చేటట్టుచేయమని దేవుణ్ణి ప్రార్థించాను.

నాప్రార్థనవల్లనో ఏమో తెలియదు—పొద్దున్నే మా ఆవిడ ఇల్లు ఊడుస్తూఉండగా పుసీ ఊగులాడుకుంటూ ఇంటోకివచ్చింది. పాపం! దానిముఖం పీక్కుపోయింది; డొక్క అంటుకుపోయింది; రెండురోజులనుంచీ తిండి లేదామె.

కాసిని పాలుపోద్దామని నేను వంటఇంట్లోకిపోయాను. వెళ్ళిచూసేవరకు మా ఆవిడ పుసీ చెవులుమూస్తున్నది.

'ఏమి'టని అడిగాను. జవాబురాలేదు. మా ఆవిడ అలవాటుచొప్పున పుస్సీని చీపురుకట్టతో సన్మానించి ఉంటుందనీ, ఆదెబ్బకే అది పడిపోయిఉంటుందనీ అనుకున్నాను. త్వరగా నీళ్లు తెచ్చి నోట్లోపోశాను. ఉహూ! లాభంలేకపోయింది. పుస్సీ వెనక రెండుకాళ్ళూ నిగడదన్ని, గుడ్లు తేలవేసింది. కాసేపు ఆగి ఇంకోమాటు గిజగిజతన్నుకుని నాచేతిలోనే ప్రాణాలు వదిలింది!

"ఛీ ఏమిటి నువ్వుచేసినపని?" అన్నాను.

"మంచిపనే చేశాను."

నేను పుస్సీని దూరంగా తీసుకెళ్ళి పారవేసివచ్చేవరకు మా ఆవిడ ఇందాకా కూర్చున్న చోటనే ఉన్నది. కాని చేతిలో ఐదు పిల్లికూనలు అదనంగా ఉన్నాయి.

"ఇవెక్కడనుంచి వచ్చినై మళ్లీ!" అన్నాను నేను.

"మీ పుస్సీ వీటిని పెట్టిపోయింది. వంటఇంట్లో పెట్టె చాటున 'కుంయ్. కుంయ్' అంటున్నవి."

ఈ రెండురోజులనుంచీ ఎక్కడ ఉన్నదో గ్రహించుకున్నాను. అయినా ఏమిలాభముంది!

"వాటి నెవరికన్నా ధర్మంచెయ్యి. లేకపోతే నాకిలా ఇవ్వు. ఎక్కడన్నా వదిలిపెట్టివస్తాను" అన్నాను.

తలవంచుకుని మా ఆవిడ—"ఎవ్వరికీ ఇవ్వను" అంది తల తిప్పుతూ.

ఆవిడ ముఖం వంక చూశాను. కళ్ళవెంట బొటబొట నీటిబొట్లు పడుతున్నవి.

[శైలజానంద ముఖర్జీ.]

# మెస్మరిజం

వినోదుడు కాళీభక్తుడు. అతనికి ఈ దేవతమీాద ఇంతభక్తి ఎలా కుదిరిందో చెప్పటం కష్టం. కాని అతను చిన్నప్పటి నుంచీ కాళీదేవిభక్తుడని గట్టిగా చెప్పవచ్చును. మొట్ట మొదట అతనికి దేవిమీాదకంటె ప్రసాదంమీాదనే ఎక్కువ భక్తి ఉండేది. క్రమంగా అదే దేవిమీాదికి తిరిగింది.

అతను చదువుకునేరోజుల్లో ఒకమాటుతోటి విద్యార్థిని మామూలు తగువుకే చావ చితకగొట్టాడు. ఈ సంగతి సవిస్తారంగా వెంటనే రిపోర్టుకూడా అయింది. దెబ్బలుతిన్న విద్యార్థి ఇంటికిపోగానే తండ్రిచేతిలోపడ్డాడు. దెబ్బలచప్పుడూ మిత్రుని ఏడుపూ విని వినోదుడు పరుగెత్తుకుంటూ కాళికాదేవిగుడికి పోయి— "తల్లీ, నాకు దెబ్బలుతగల కుండా కాపాడు!" అని ప్రార్థించి ఇంటికివచ్చాడు. ఆవాళ ఇంటిదగ్గర ఎవ్వరికీ తెలియలేదు.

ఈవిధంగా అతను కాళీదేవి ప్రసాదంతోనే జీవిత యాత్రను గడుపుకుంటూ వస్తున్నాడు. స్కూలుకు చదవ కుండాపోతే, కాళికాదేవికృపవల్ల మాస్టరు ఇతన్ని ప్రశ్నలు వేసేవాడుకాదు. ఈదేవికృపవల్లనే అతను అన్నిపరీక్షలూ నెగ్గినాడు; లాయడ్సుబ్యాంకులో ఉద్యోగంకూడా దొరికింది. దేవికృపవల్లనే అతనికి ఎన్నడూ జలుబుకూడా చేసి ఎరగదు. తేల్చిచెప్పాలంటే—అతనికి దేవిమీాద ఎంతభక్తో దేవికి అతనిమీాద అంత దయ.

ఇంత జాగర్తగా వెలుగుతున్న వినోదుడుకూడా ఒక

కలగజేసుకునేవి. భర్త తలుపు బిగించుకుని ఇంట్లో ఏమేమో చేస్తున్నాడని భార్యకు అనుమానం కలిగింది. ఆమె తీరిక చిక్కినప్పుడల్లా గదిదగ్గరకు వచ్చి తొంగి చూసి పోతూ ఉండేది. ఇక లోపలినుంచి మాటలు వినపడ్డప్పుడు ఆమెకు శివం పెరిగేది. "తలుపు తెరవండి! గదిలో కూర్చుని ఏమిచేస్తున్నారు? గదిలో నాకేమీ పని లేదనుకున్నారేమి?" అని తలుపు దబదబా బాదేది.

వినోదునికి అలాంటప్పుడు సమ్మోహననిద్ర ముంచుకొస్తూ ఉండేది. ఈ కేకలకు ఉలిక్కిపడిలేచి, చీరే, పుస్తకమూ దడబడా దాచి గడియతీసేవాడు.

భార్య తలుపు నెట్టుకుని లోపలికి వచ్చి, సందేహదృష్టితో గదంతా కలయజూచి "ఎవరితో మీరు మాట్లాడేది? మీకు రోజురోజుకూ——"అనేది.

వినోదుడు మామూలుగా సమాధానం చెప్పేవాడు కాడు. భార్య ఒకరోజున పట్టుపట్టింది. వినోదుడు దీక్షతీసుకున్నానని చెప్పాడు.

భార్య బుగ్గను వేలుపెట్టుకుని——"సరే! గుడ్డలువిడవటం లేదు, కాళ్లు కడుక్కోవటంలేదు, పీటలేదు, తీర్థంలేదు, జపాలా?" అన్నది.

"మనస్సు పవిత్రంగా ఉంటే చాలు; ఇవేవీ అక్కరలే"దని వినోదుడు చెప్పాడు.

"ఏమోనమ్మా! ఇలాంటిజపం నే నెక్కడా చూడలేదు" అంటూ భార్య వెళ్లిపోయింది.

కొన్నాళ్లయిన తర్వాత వినోదుడు ఎక్కడనుంచో ఒక

కుక్కను పట్టుకు వచ్చాడు. ఆవాళ భార్య భగ్గున మండింది. ఝుంయ్ మని లడాయి వేసుకుంది! వినోదుడు ఎవరు అందుకో లేదు, భార్యకు కనపడకుండా నవ్వుకున్నాడు. అంతే తర్వాత కుక్కను చాటుగా గదిలోకి తీసుకుపోయి, టేబిలు కోటుకు కట్టివేసి దానివంక తీక్ష్ణంగా చూస్తూ ఇలా ఆజ్ఞాపించాడు: ''నేను చెప్పినట్టుగా నువ్వు నిద్రపోతావు. అదిగో, కళ్లుకూడా మూశావు! అదిగో, అదిగో'' కుక్క గాభరాపడి నాలిక వేలాడవేసి, కాసేపు పిచ్చిదానిలాగ చూసి తర్వాత కళ్లు సగం మూసింది.

వినోదుడు తన సాఫల్యానికి ఎగిరి గంతు వేసేవరకు కుక్క 'కంయ్'మన్నది. ఇంకేం? పొయ్యి దగ్గర ఉన్న భార్య పరుగెత్తుకుంటూ వచ్చి — ''కుక్కను ఇంట్లో కూడా చేర్చారూ? వెళ్లగొట్టండి. నేను చెబుతున్నాను, బాగుండదు!'' అని రంకె వేసింది.

వినోదుడు తలుపు తెరవలేదు. ''దేవతలకు కుక్కలూ మనుషులూ సమానమే. అసలు ప్రపంచంలో భ్రాతృభావం వర్ధిల్లాలంటే ముందు కుక్కల్నే ప్రేమించాలి'' అన్నాడు.

భార్య విసుక్కుంటూ వెళ్లిపోయింది.

ఒక ఆదివారంనాడు వినోదుడు చెల్లెని ఇంటికిపోయి మేనల్లుణ్ణీ, మేనకోడల్నీ వెంటబెట్టుకు వచ్చాడు. వస్తూ వస్తూ పిప్పరమెంటు బిళ్లలూ, బిస్కట్లూ కూడా కొనుక్కు వచ్చాడు. ఆవాళ భోజనాలయినాక వినోదుడు పిల్లల నిద్దరినీ గదిలోకి తీసుకుపోయి తలుపు బిగించాడు.

''మామా, నాకు బిస్కట్లు పెట్టవూ?'' అన్నది పిల్ల.

"నాకు సిప్పరమెంటు బిళ్లలు?" అన్నాడు పిల్లవాడు.

"ఇస్తాను. ముందు నేను చెప్పినట్టు వినండి" అన్నాడు వినోదుడు.

"ఏమిటో చెప్పు" అన్నారు పిల్లలిద్దరూ.

వినోదుడు వాళ్లను కుర్చీలో కూర్చోబెట్టి, ఒక్కొక్కరి కళ్లవంక తీక్ష్ణంగా చూస్తూ — "మీకు నిద్రొస్తున్నది; అదిగో, మీరు కళ్లు మూస్తున్నారు; తెరవలేరు" అన్నాడు.

పిల్లలిద్దరూ కళ్లు మూశారు. వినోదునికి తన శక్తి మీద మంచి నమ్మకం కలిగింది.

ఇక ఎవరినైనా మెస్మరైజ్ చేయగలనని అనుకొని — "ఇక కళ్లు తెరవండి" అన్నాడు.

పిల్లలిద్దరూ కళ్లు తెరచి కుర్చీలోనుంచి దిగి బిస్కట్లు పెట్టమని కూర్చున్నారు.

ఆ తర్వాత వినోదుడు ఇచ్ఛాశక్తిని ఇంకోవిధంగా పరీక్షింప నారంభించాడు.

ఒక రోజున అతను గదిలో కూర్చుని ఉండగా కిటికీ దగ్గర కాకి ఒకటి వచ్చి వాలింది. వినోదుడు దానివంక తీవ్రంగా చూసి — "నేను చెప్పిన ప్రకారం నువ్వు ఎగిరి పోతావు?" అని మ్యాగ్నెటిక్ పాస్ రెండుసార్లు తిప్పాడు. కాకి ఎగిరిపోయింది.

ఇంకో రోజున అతను ఆఫీసుకు పోతూ ఉండగా మెట్ల మధ్యనే పిల్లి ఒకటి ఎదురుపడింది. వినోదుడు దానిమీద సమ్మోహన శక్తినంతా వినియోగించి—"నువ్వెంత మాత్రం పైకి రాలేవు!" అన్నాడు. పిల్లి కొన్ని సెకండ్లు

అతని వంక చూసి మెదలకుండా దిగిపోయింది. దోవలో పది సంవత్సరాలపిల్ల మూడేళ్ళ పిల్లను చంకను వేసుకుని జెల్లపు బుట్ట చేతపట్టుకు వస్తున్నది. వినోదుడు ఆ పసిపిల్ల వంక మిరిమిరి చూసి — "నేను చెప్పిన ప్రకారం నువ్వు ఏడుస్తావు! అదిగో, అదిగో, అదిగో, ఏడ్చావు!" అన్నాడు.

పిల్ల నిజంగానే ఏడ్చింది. పెద్ద పిల్ల విస్తుపోయింది. వినోదుడు చిన్న పిల్లను పిలిచి చేతిలో అర్ధణా పెట్టి పంపించాడు. అక్కడ పోగయిన నలుగురైదుగురూ ఇతను పిచ్చివాడని తీర్మానించుకున్నారు.

వినోదుని పొరుగున ఆశుబాబు కాపురం. ఒకనాడు అతను వినోదుని దగ్గరకు వచ్చి, విశ్వం (అతని కొడుకు) లెఖ్ఖల్లో బొత్తిగా వెనక పడ్డాడనీ, వాణ్ణి ఎలాగైనా తయారు చేయమనీ కోరాడు. వినోదుడు 'అదెంత భాగ్యం. పంపించ' మన్నాడు. మర్నాటి ఉదయం విశ్వం, పాపం, నేర్చుకోటానికి వచ్చాడు. వినోదుడు వాడికి ఇలా చెప్పాడు :

"నాయనా, ఇప్పుడు నీకు లెఖ్ఖలు బొత్తిగా తల కెక్కటం లేదు. రెండు మూడు లెఖ్ఖలు నేను చెప్పినా నువ్వు అవి తప్ప కొత్తవి వెయ్యలేవు. దీనికి కారణం ఇది; అర్ధంకాని లెఖ్ఖలు నేను వేయలేనని నీకు మనస్సులో డక్కపడి పోయింది. ఆ సందేహం పోనిది నీవు ఏ లెఖ్ఖా వేయలేవు, అందుకని ముందు నేను నీ మనస్సుకు చికిత్స చేస్తాను. అప్పుడు నీవేమీ నేర్చుకో నక్కరలేదు. దానంతటదే వస్తుంది."

విశ్వాన్ని ఈజీచైరులో కూర్చోబెట్టి, వాడి కనుబొమ

మధ్య వినోదుడు తీక్ష్ణంగా చూస్తూ మాగ్నెటిక్ పాస్ రెండుసార్లు అటూ, ఇటూ తిప్పి "నీ కనురెప్పలు బరువెక్కుతున్నవి. నువ్విప్పుడే నిద్రపోతావు?" అన్నాడు.

అన్నట్టుగానే విశ్వం సమ్మోహన నిద్రలో పడిపోయాడు. వినోదుడు కుర్రవాణ్ణి కళ్లు తెరవమని ఆజ్ఞాపించి, చేత్తో చిన్న కాయితం పట్టుకుని "ఇదిగో, నా చేతిలో ఉంది గులాబీ పువ్వుకాదా?" అన్నాడు.

"ఆఁ, గులాబిపువ్వు!" అన్నాడు కుర్రవాడు.

వినోదుడు గోడమీది సున్నపు బెల్లిక తీసి కుర్రవాడి చేతికిచ్చి తినమని, అడిగాడు.

"నువ్వు తినేది లడ్డా, జిలేబా?" "లడ్డు జిలేబీ" అన్నాడు కుర్రవాడు పటపట బెల్లిక నములుతూ.

తర్వాత వినోదుడు ఆ కుర్రవాడికి—"నువ్వు ముందు లెఖ్ఖల్లో గొప్ప పండితుడివి కాబోతున్నా"వని నచ్చచెప్పాడు. అంటే కుర్రవాడి అంతరాత్మకు అన్నమాట. ఈ విధంగా చికిత్స నాలుగైదు రోజులు సాగింది. ఇప్పటి విశ్వం వెనకటి విశ్వంకాదు. లెఖ్ఖల్లో గొప్ప మొనగాడని అందరికీ తెలిసిపోయింది.

*   *   *

కొన్నాళ్ళనుంచి వినోదుని భార్య స్వభావంలో మార్పు కనపడింది. నాలుగైదు రోజులనించి మాటలుకూడా లేవు. ఆవాళ ఉదయం వినోదుడు భార్యని పిలిచి, ఈజీచైరులో కూర్చోబెట్టి ఇలా అన్నాడు: "చూడూ, మన ఇద్దరి మనస్సులూ కలియకపోవటం మూలాన ఎవ్వరికీ సుఖంలేకుండా

ఉంది. దీన్ని ఇలాగే పెంచుకుంటూపోతే లాభ మేమిటి ?''

''అది నాతప్పనా? నువ్వు గనక'' అంది భార్య కోపంతో.

తనుకూడా కోప్పడితే కేసు పాడైపోతుందని గ్రహించి వినోదుడు — ''అదికాదు. నేను నీమీద నెపం వేశానా? నే నన్నఉద్దేశం, మనఇద్దరం కలిసిపోతే—''అన్నాడు.

''అయితే నేను ఏమిచేయాలని మీ ఉద్దేశం?''

''చూడూ, మనిద్దరం — సరేగాని నువ్వు నాకళ్లవంక చూడూ!'' అని వినోదుడు, భార్య కనుబొమలమధ్య తీక్షణంగా చూస్తూ ''ఇక నువ్వు నిద్ర —''అన్నాడు తీవ్రంగా.

వినోదునిమాట పూర్తిచేయనివ్వకుండానే భార్య కుర్చీలోనుంచి లేచి—''ఛీ, ఛీ, ఆఖరికి తాగుడుకూడా అలవాటుఅయ్యారూ? కాస్తన్నా సిగ్గులేదా?'' అన్నది.

వినోదుడు తలపుచ్చుకు కూర్చోబడ్డాడు.

మర్నాడు వినోదుడు తెల్లవారుఝామునే మేలుకున్నాడు. క్రిందటిరోజున జాగ్రత్తచేసిపెట్టుకున్న ఫ్లాష్‌లైటు వెలిగించి, నిద్రపోతున్న భార్య ముఖం వంక తీక్ష్ణంగా చూస్తూ బిగ్గరగా—''నా ఆజ్ఞప్రకారం నువ్వు తప్పక నిద్రపోతావు. అదిగో, నీకళ్లు మూతలుపడుతున్నవి. అదిగో, అదిగో'' అనసాగాడు. ఒకమాటు భార్యను కదిలించాడు కూడాను. భార్య నిద్రనుంచి లేవటంతోటే సమ్మోహన నిద్రలో పడవేయాలని వినోదుని ఆశ.

కళ్ళమీదపడ్డ తీవ్రమైనకాంతికీ, వినోదుని ప్రబల ఇచ్ఛాశక్తికీ ఆమెమామూలు నిద్రనుంచి మేలుకొంది. ఆమెకు ఈ జరిగేదేమిటో అర్థంకాలేదు; విస్తుపోయింది. వినోదుడు

ఇటువంటి ముహూర్తంకోసమే ఎదురుచూస్తున్నాడు. ఈ ముహూర్తంలోనే అతను ప్రపంచాన్ని జయించవలసి ఉంటుంది! అతను చేతిలోని మ్యాగ్నెటిక్‌పాస్‌ను తొందరగా తిప్పుతూ—"అదిగో, నీ కనురెప్పలు మూసుకుపోతున్నై. కళ్లు తెరవలేకుండా ఉన్నావు. ఇక నిద్రపోతావు" అనసాగాడు.

వినోదుడు ఎంత ప్రయత్నించినా భార్యకు సమ్మోహన నిద్రరాకుండానే చైతన్యంకలిగింది. ఆమె మంచంమీద నుంచి లేచి ఆశ్చర్యంతో అన్నది:

"మీకు పిచ్చిఎక్కిందా ఏమిటి? ఏమిటీవాగుడు? నెత్తిమీద నీళ్లుపోస్తాను. ఉండండి...కొడతారా ఏమిటి? నన్ను వదలండి, బాగుండదు. ఇప్పుడే చెప్పుతున్నాను—"

వినోదుడు ఒక్కక్షణంకూడా వృథాపోనివ్వకూడదని నిశ్చయించుకున్నాడు. అతను భార్యని, శక్తినంతా వినియోగించి—ఈజీచైరులో కూర్చోబెట్టాడు. కాని ఆమె అతన్ని పడనెట్టి లేచినుంచున్నది. వినోదుడు మళ్ళీ శక్తినంతా వినియోగించి ఆమెను కుర్చీలో పడవేసి కట్టివేయాలని ప్రయత్నిస్తూవుండగా, అతన్నిపడేసి, అతను నేలమీదనుంచి లేచే లోపలనే గదిలోనుంచిపోయి బయట గొళ్లెం పెట్టింది.

తెల్లవారింది. పాచిఊడ్చేమనిషివచ్చి బయటతలుపు తట్టింది. వినోదునిభార్య తలుపుతీసి ఏడుస్తూ — "రామీ, పరుగెత్తుకుంటూపోయి మా అత్తను పిలుచుకురా. బాబుగారికి పిచ్చి ఎక్కింది—"అన్నది.

"అదేమిటి, అమ్మగారూ!" అన్నది ముందు ఆశ్చ

ర్యంతో. తర్వాత సంగతి అంతా విని "ఇది పిచ్చి కాదనీ, గాలిచేష్ట అనీ" చెప్పింది. దాని మేనమామకొడుకు మాంచి భూతవైద్యుడట. కాళీఘాటు పైపున ఉంటాడట. వాడిని పిలిస్తే ఇలాంటివి ఒక్క క్షణంలో నయం చేస్తాడట. బస్సు బాడిగా, రెండు రూపాయలు దక్షిణా ఇస్తే ఇప్పుడే పోయి అతన్ని తీసుకువస్తుందట — ఈమెనుగురించి ఇతర్ల ఇళ్ళదగ్గర పనులుకూడా మానుకుని.

"కాదులే, ముందు నా అత్తనే పిలుచుకురా, తర్వాత మీ మేనమామకొడుకును పిలవవచ్చు" అంది వినోదుని భార్య.

"ఎండ ఎక్కితే అతను ఫ్యాక్టరీపనికిపోతాడమ్మా ఇంటికాడ ఉండడు. నేను అతన్ని పిలుచుకువచ్చినాక అత్తగారిని తీసుకొస్తాను" అన్నది రామి.

* * *

ఏడుఘంటలకల్లా భూతవైద్యుడు ఇద్దరు అనుచరులతో సహా వచ్చేశాడు. ఈ రోగిని చూసి భూతమనే తేల్చాడు. అయినా, భయమేమీ లేదు — క్షణంలో వదిలిస్తానన్నాడు.

వినోదునికి మొదట ఆశ్చర్యం కలిగింది. తర్వాత కోపంతో మండిపడ్డాడు: "ఎవడు మిమ్మల్ని పిలిచింది? పదండి, ముందు ఇంట్లోనుంచి బయటికి"

భూతవైద్యుడు ఈ మాటలు లక్ష్యపెట్టలేదు. నానా బూతులూ తిట్టి, వినోదుణ్ణి ఆవేశించిన భూతాన్ని పొమ్మని ఆజ్ఞాపించాడు. వినోదుడు ఇక సహించలేకపోయాడు. భూతవైద్యుడి రెండు చెంపలూ వాయించాడు. భూతవైద్యుడు కోపంతో ఏవేవో మంత్రాలు చదివి, అనుచరుల

సహాయంతో వినోదునినోటిలో తినగూడనివన్నీ పెట్టి, దుర్గంధంతో పొగపెట్టాడు. తర్వాత చీపురుకట్టతీసుకుని వీపుమీద నాలుగు ఉతికాడు.

వినోదుడు ఇక సహించలేకపోయాడు. పట్టుకున్నవాళ్లని పడనెట్టి పందిరిమంచపుకోడులాగి భూతవైద్యత్రయాన్ని ఇంట్లోనుంచి బయటపడిందాకా కొట్టాడు. భూతవైద్యుడు మొట్టిదిగుతూ ఇలా చెప్పిపోయాడు:

"అమ్మా, ఇది తురకపెయ్యం. హిందువులం మేము, దీన్ని పారగొట్టలేము. లాహోరులో ఫకీరుద్దీన్‌ముల్లా అనే ఫకీరొకడున్నాడు. పాతికరూపాయలు పంపితే అతను వచ్చి వదలగొడతాడు" వినోదుని భార్య ఎప్పుడో వంటగదిలోకి పోయి తలుపు వేసుకుంది.

* * *

వినోదుడు ఆపూట భోంచేయకుండానే ఆఫీసుకుబయలుదేరాడు. దోవలోఉన్న కాళికాలయంలోకిపోయి సాష్టాంగప్రణామంచేసి—"అమ్మా! నీవు నాకేమీ తోడ్పడలేదే! ఇంతకాలంనుంచీ చేసినసాధన వృథాపోయినట్టేనా!" అని ప్రార్థించాడు.

ప్రార్థన అయి లేచినుంచోగానే అతనిదృష్టి శివుని జటాజూటంలోఉన్న దేవిమీదపడింది. వినోదుడు మళ్లీ సాష్టాంగప్రణామంచేసి ఇలా అన్నాడు: "తల్లీ! నువ్వే భర్త నెత్తిమీద ఎక్కిఉంటవి. ఇక నాకేంసహాయం చేస్తావు! నీదగ్గర ఫిర్యాదుచేయుటమే నాది పొరపాటయింది. క్షమించు!"

(సజనీ కాంతదాస్)

# కాయకల్పచికిత్స

హరిద్వారంలో కుంభమేళ. అది అన్నప్పుడెల్లా వచ్చే పర్వం కాదు. అందుచేతనే, పుణ్యం ఆర్జించాలనే కోరికతో నాలుగుదిక్కులనుంచీ జనం ఇసకవేస్తే రాలకుండా పోగవుతారు.

ఈ కోరికతోనే జడ్జి మదనమోహనబాబుకూడా సపరివారంగా హరిద్వారం విచ్చేశాడు. వీరికి ఇప్పుడు యాభైయేడు ఏళ్లు. స్థూలశరీరం. పెన్షనుకూడా తీసుకున్నాడు. ఇక్కడ చలి అధికంగా ఉండటంచేత, వీరికి మళ్ళీ పాత కీళ్ళనొప్పులు బయటపడినవి. అందుకనే కీళ్ళకు 'బ్యాండేజి' చుట్టుకుని తీర్థంచూట్టానికి బయలుదేరాడు.

ముందు కీళ్ళనొప్పులతో కుంటుతూ జడ్జీగారు; వెనక వారిభార్య—ఈమెకూడా లావులో భర్తకు తీసిపోదు; ఆ వెనక కోడలు కేతకి: అందరికీ చివరకొడుకు మణిలాలు—బక్కపలచని శరీరం; స్ఫురద్రూపి. ఇతను దోవలో అరిచేయి చాటుచేసుకుని తండ్రిని కానకుండా సిగరెట్టు పీలుస్తున్నాడు. జడ్జీగారు కొంతదూరం నడిచి, కర్రఊతం చేసుకు నిలబడ్డాడు. మణిలాలునోటిలో సిగరెట్టు పూర్తిగా కాల్చకుండానే అవతల పారవేశాడు.

"ఏమండీ, ఇంకా పోట్లు తగ్గలేదా?" అని భార్య జడ్జీగారిని అడిగింది.

"అబ్బ" అని ముఖం చిట్లించుకున్నాడు జడ్జీగారు.

"రాకపోయినా బాగుండేది" అన్నాడు కొడుకు.

"నే నొక్కడినీ ఇంటికాడఉంటేమాత్రం ఏమిటో చేది? ఇలాంటిపర్వం మళ్ళీ చూచేరాత ఉండేదా?"

"వచ్చిపతర్వాత అనుకుంటేమాత్రం ఏంలాభం? సరే, బోడీ, నువ్వ మీ నాన్న చెయ్యిపట్టుకు నడవరా!" అన్నది భార్య. మంజీలాలుముద్దుపేరు బోడి.

ఎదురుగ్గా గంగ. సూర్యుడు ఉదయిస్తున్నాడు.

ఆరిపోవటానికి సిద్ధంగా ఉన్న నెగడీముందు ఒకసన్యాసి శిష్యసహితంగా కూర్చుని ఉన్నాడు. ఉదయిస్తూ ఉన్న సూర్యునివంక అర్ధనిమీలితనేత్రాలతో చూస్తూ, బహుశా జపంచేసుకుంటున్నాడనుకుంటాను. జడ్జీగారు సపరివారంగా వచ్చి అక్కడ నిలబడ్డాడు.

సన్యాసిని చూడగానే జడ్జీగారిభార్యకు భక్తికలిగింది. మెల్లగా భర్తతో—"చూడండీ, సన్యాసులకి చాలాశక్తులుంటవట. వాళ్లు మీకీళ్ళనొప్పులు కుదర్చలేరా" అన్నది.

జడ్జీగారికి కీళ్ళనొప్పులు కొంచెం తగ్గినవనుకుంటాను. నవ్వుతూ—"కుదర్చవచ్చు. కాని, నాకు ఒకరోగంకాదుగా—అజీర్ణం, రక్తపుపోటు, మధుమేహం—" అన్నాడు.

"అబ్బ, చాలిద్దురూ, మీదండకం తెగేదికాదు!" అన్నది భార్య. కోడలు అత్తకొంగులాగి—"మామగారు రోగాలపుట్ట!" అన్నది మెల్లగా.

జడ్జీగారికి ఆమాట వినపడింది. "ఏమిటి అన్నది? రోగాలపుట్ట!—కాని ఈపుట్టని రేవులోనుంచి కదిలించలేకుండా ఉన్నాను అమ్మాయీ!"

"అయినా ఓమాటు సాధుకు చూపించండి" అంది భార్య.

"ఏమిలాభం? ఒకటిపోతే ఇంకొకటివస్తుంది — ఈ దేహాన్ని ఏమీ మార్చలేముగా! వయసు మిగలటం మూలానే ఇదంతా" అన్నాడు. జడ్జీ నిస్పృహతో.

"అదీ నిజమే" అని భార్య సమర్థించింది.

కోడలు అత్తకు బాగా దగ్గరగా వచ్చి — "అయినా కొంతకాలం సుఖపడతారుగా! ప్రయత్నించి చూడకూడదూ?" అన్నది ఊర్మిలత సానివ్యకంగా.

ఈలోపున సాధు ఆసనం త్యజించి, జడ్జిగారి భార్యవంకకు తిరిగి "ఏంకావాలి అమ్మా?" అని హిందీలో అడిగాడు.

"ఏమని చెప్పేది స్వామీ! మేము సంసారులం, అన్నీ కావాలి" అన్నది ఆమె.

"అవును, ఆమాట నిజమే" అన్నాడు సాధు నవ్వుతూ.

"అంతా బోగస్" అని, మణిలాలు కొంచెం ఎడంగా పోయి సిగరెట్టుముట్టించే ప్రయత్నంలో ఉన్నాడు.

ఒక శిష్యుడు నెగడీలోనుంచి భస్మంతీసి ముగ్గురికీ బొట్టు పెట్టాడు.

'ఒరే-బోడీ, ఇట్లారా" అని తల్లి మణిలాలును పిలిచింది. మణిలాలు సిగరెట్టు జేబులో పెట్టుకుంటూ — "ఎందుకు?" అన్నాడు మహావిరక్తిగా.

"స్వాములవారు బొట్టుపెడతారు ఇట్లారా!"

ఇష్టంలేకపోయినా మణిలాలుకు రాకతప్పింది కాదు. బూడిదబొట్టు పెట్టించుకుని—"అంతా నేస్టీ!-సరేనాన్నా! నీకుకూడా వీటిమీద నమ్మకం ఉందా?" అని తండ్రిని అడిగాడు ముఖం చిట్లించుకుని.

"అలా అనకు. పాపం చుట్టుకుంటుంది. పాపం! ప్రపంచానికి ఏమన్నా కీడు జరగాల్సి ఉంటే వీరివల్లనే జరుగుతుంది" అన్నాడు తండ్రి.

జడ్జీగారిభార్య నేలమీదకూలబడి, సన్యాసికి భర్తను చూపిస్తూ—"కీళ్ళనొప్పులతో మహాయాతన పడుతున్నారు. ఏమన్నా ఔషధం ఇవ్వండి స్వామీ!" అని అడిగింది.

జడ్జీగారు మందహాసం చేసి మరల ఆరంభించారు. "ఒక్క కీళ్ళనొప్పులే అనుకున్నారా? ముసలివాణ్ణి అయ్యాను. అజీర్ణం, రక్తపుపోటు, మధుమేహం—"

మణిలాలు నిట్టూరుస్తూ—"నిజంగా, ఏళ్లు వచ్చినకొద్దీ మతికూడా పోతున్నది!" అన్నాడు

జడ్జీగారిభార్య కోపంతో—"నువ్వు ఊరుకోరా బోడీ! నీకు తెలుసో తెలియదో, చిన్నప్పుడు నిన్ను బ్రతికించింది కూడా సాధువే!" అన్నది.

"ఇంకేం డాక్టర్ల కొంపమీదకు వచ్చింది. ఇక ప్రపంచంలో ఎవ్వరూ చావరు!"

"ఏమంటున్నారా అబ్బాయి?" అని సన్యాసి మణిలాలు వంక చూశాడు.

జడ్జీగారిభార్య ఆతురతతో—"వాడు కుర్రవాడు. వాడి మాటలు తప్పుగా ఎంచకండి" అని బతిమాలింది.

"గురువుగారికి ఎప్పుడూ కోపం రాదు. మీకేం భయం లేదు" అన్నాడు శిష్యుడు.

జడ్జీ "వాళ్ళు ఈ కాలంవాళ్లు కాదూ? ఇలాంటి వేవీ నమ్మరు" అన్నాడు.

సన్న్యాసి మణిలాలు వంక చూసి మందహాసం చేశాడు. తర్వాత జడ్జీ వంకకు తిరిగి — "చూడరా అబ్బాయి! నీ రోగాల నన్నిటినీ నేను కుదర్చగలను. కాయకల్పం చేసుకోవాలి!" అన్నాడు.

"ఇది ఎక్కడిది!" అన్నాడు మణిలాలు నవ్వుతూ.

"ఒక మాసం నువ్వు నా ఆధీనంలో ఉంటే మళ్ళీ కుర్రవాడిలాగా అవుతావు" అన్నాడు సాధు.

మణిలాలు నవ్వుతూ—"ఇంకేం, హాసు ఎక్కువైంది!" అన్నాడు.

జడ్జీగారు ఎక్కడలేని భక్తితో — "అదే చేయండి స్వామీ! ఈ చివర నాలుగు రోజులన్నా సుఖంగా బతుకుతాను" అన్నాడు.

మణిలాలు వకీలు. భక్తిమీద అతనికి విశ్వాసం లేదు. అయిష్టంతో—"మీకు్కడా ఏమన్నా పిచ్చా నాన్నా?" అన్నాడు.

కేతకి అత్త పిపుగిరి భర్తకు వినపడేట్టుగా—"సాధువులికి సాధ్యంకాని దేముంది? అన్నీ చేయగలరు" అన్నది.

జడ్జీగారి భార్య రోదన స్వరంతో — "అదే చేయండి స్వామీ! ఈ ముసలితనంలో కీళ్లనొప్పులతో చాలా బాధపడుతున్నారు" అని బతిమాలింది.

"ఐతే రేపు ఉదయం రండి. దాని ఏర్పాట్లన్నీ చేస్తాను" అన్నాడు సన్న్యాసి.

కాయకల్ప చికిత్సకు కావలసిన ఏర్పాట్లన్నీ అయినవి. ఒక మాసం భార్యనుగానీ, పిల్లలనుగానీ చూడకుండా చీకటి

గదిలో ఏకాంతంగా ఉంచి, సన్యాసి చెప్పిన విధంగా నడుచుకోవాలట. మర్నాడు మణిలాలు—''నాకు ఇక్కడ ఉంటానికి ఎలా వీలో చెప్పండి? ఎల్లుండి కోర్టులో చాలా కేసులున్నవి. క్లయింట్ల దగ్గర ముందే డబ్బు తిని కూర్చున్నాను. వెళ్ళకపోతే బాగుండదు'' అన్నాడు.

''అయితే పోరాదూ? కోడల్నీ, మీ అమ్మనీ కూడా వెంటబెట్టుకు వెళ్లు.''

''ఏమిటిరా నువ్వు అనేది? కానిదేశంలో ఒంటరిగాణ్ణి చేసి కలకత్తా ఎలా వెళ్తాము?'' అంటూ జడ్జీగారి భార్య వచ్చింది.

జడ్జీగారు మందహాసం చేస్తూ—''ఇవ్వాళ ఎంత పెన్షను తీసుకున్నా, ఒకప్పుడు నేను జడ్జీనేగా?' అన్నాడు.

''అయినా ప్రాణం ఎలా ఒప్పుతుంది?'' అన్నది భార్య.

''ఒప్పేటట్టు చేసుకోవాలి. చూడు, ఒక మాసం నేను నియమానుసారంగా చీకటి గదిలో కూర్చోవాలి: నువ్వు రోజూ సంగతులు తెలుసుకోవటానికి నా దగ్గరకు వచ్చి సంసార తాపత్రయాలు తెలుపుతూ వుంటే ఎలా? నా మనస్సు కుదురుగా ఉంటుందా?''

''ఉంచాలంటే బాగానే ఉంటుంది'' అన్నది భార్య.

''అదే స్త్రీలో ఉన్న రోగం!'' జడ్జీగారు విరక్తితో అన్నారు—''అసలు ఆడవాళ్లకున్న రోగం యిదే; నమ్మకం ఉండదు! మీరు కలకత్తా వెళ్లిపోండి. ఇక్కడ గుమాస్తా ఉంటాడు అతను రోజూ స్వామిని కనుక్కొని మీకు ఉత్తరం రాస్తూ ఉంటాడు.''

"ఏమిరా బోడీ ఏమంటావు?" అన్నది కొడుకును మధ్యస్తిని చేసి.

"అసలు ఇది రేపెట్టింది నువ్వు. నువ్వే సంబాళించుకో"

"నాకిలాంటి పిచ్చివాటిమీద నమ్మకం లేదు" అన్నాడు కొడుకు. జడ్జీ — "చదవేస్తే ఉన్న మతిపోయింది నీకు! యయాతి కథ ఎప్పుడైనా విన్నావా?"

"కథకి కాళ్లుండవు—"

"నిజంగా జరగకపోతే అసలు కథే పుట్టదు."

"మీ రెంతన్నా చెప్పండి, నాకు నమ్మకం లేదు."

"సరేగాని, మేముంటే ఏమండీ?" అని అడిగింది భార్య.

"ఇదే ఉన్న చిక్కు. నేను ఎంత చెప్పినా మీకు నచ్చదు. ఈ నాలుగు రోజులన్నా ఆరోగ్యంగా బతుకుదామంటే మీరు ఓర్వలేకుండా ఉన్నారు."

"సరే మీ ఇష్టమొచ్చినట్టు చేసుకోండి" అన్నది భార్య అలుకతో.

ఇక విధిలేక జడ్జీగారిని హరిద్వారంలో వదిలి పెట్టి, ఆ రాత్రి బండికి అందరూ కలకత్తా వెళ్ళిపోయారు. స్వాముల వారిని కబుర్లు కనుక్కుని ఉత్తరాలు రాయటంకోసం గుమాస్తా అక్కడ ఉండిపోయాడు.

కాయకల్ప చికిత్స ఆరంభమైంది. జడ్జీగారి భార్య మన శ్శాంతికిగాను రోజూ ఉత్తరంద్వారా గాని, టెలిగ్రాము ద్వారాగాని కబుర్లు రానారంభించినవి. మొదటి రిపోర్టులు:

"చికిత్స ప్రారంభమైంది. సాధుగారు శ్రమ లెక్కచెయ్యకుండా చికిత్స చేస్తున్నారు." ఇలా నాలుగైదు రిపోర్టులు

వచ్చినాక—"చికిత్స ఫలితం ఆశాజనకంగానే ఉంది" అని ఒకమాటు వచ్చింది.

"శరీరంలో క్రమంగా బలం వస్తున్నది. రక్తనాళాల్లోనూ కొత్తస్ఫూర్తి కలుగుతున్నది." అని ఇంకో రిపోర్టు.

మాసాంతాన వచ్చిన రిపోర్టు ఆశాతీతంగా ఉన్నది. గుమాస్తా రాస్తున్నాడు :

"చికిత్స ప్రారంభించినప్పుడు కట్టుడు దంతాలు తీసివేశారు. ఇప్పుడు వాటి చోట్లో కొత్త దంతాలు పుట్టుకు వస్తున్నవి. నెరసిన వెంట్రుకలు రాలిపోయి నల్లని వెంట్రుకలు మొలుస్తున్నవని సాధుగారు చెపుతున్నారు."

తర్వాత క్లుప్తంగా ఉన్న ఉత్తరం వచ్చింది. "ఫలితం ఉత్సాహకరంగా ఉంది."

దీని తర్వాత మూడురోజులవరకు ఉత్తరం పత్రం లేదు. ఇంట్లో వాళ్లంతా ఆదుర్దాపడుతూ ఉండగా ఈ కింది టెలిగ్రాము వచ్చింది :

"రేపు ఉదయం బండికి హౌరా స్టేషనులో దిగుతాము మీరందరూ బండి దగ్గరకు రండి."

టెలిగ్రాము చూచి మణిలాలు చప్పరించాడు. తల్లితో—"నేను చెప్పలేదా, అంతా దగా!" అన్నాడు.

"ఏదో ఒకటి బాబూ! రేపు ఉదయం బండి సిద్ధంగా ఉంచు!" అని తల్లి వెళ్లిపోయింది. అత్త వెళ్లిపోగానే కేతకి వచ్చి—"ఏమండోయి నిన్న మనం చూసి వచ్చిన చీర తీసుకురండి. రేపు అది కట్టుకునే నేను స్టేషనుకు వస్తాను" అన్నది.

"ఇదిగో, నాకు ఎక్కువ తీరిక లేదు. నన్ను ఎక్కువగా వేధించావంటే, కాయకల్ప చికిత్స చేసుకుని ముసలివాణ్ణవుతాను" అన్నాడు మణి.

"కాయకల్ప చికిత్సకు ముసలివాళ్ళుకూడా అవుతారా?"

"ఎందుకు కారూ! కుర్రవాళ్లు కాగలిగితే ముసలివాళ్లు కాలేరా?"

"అలాగే అవుతారు లెండి! మీరు కోర్టునుంచి వచ్చేటప్పుడు చీరె తేవటం మరచిపోరుగా?" అన్నది కేతకి.

"ఇదిగో, నీకూ నాకూ మూడు రోజులు దాకా మాటగ నోము!" అన్నాడు మణి.

"చాల్లెండి!" అన్నది కేతకి కనుబొమలు ఆడిస్తూ.

అనుకున్నది ఒకటి, జరిగింది ఇంకొకటి.

నిర్ణయించుకున్న దినానికి ఒకరోజు ముందుగానే, అందరినీ దిగ్భ్రమ చెందించాలనే ఉద్దేశంతో జడ్జీ మదన మోహనబాబు కలకత్తా బయలుదేరాడు! 57 సంవత్సరాల వృద్ధుడు కాయకల్ప మహిమవల్ల 25 సంవత్సరాల యువకుడై నాడు. అచ్చుగా కొడుకు మాదిరిగా ఉన్నాడు. ఇద్దరినీ ఒక్కచోట నిలబెట్టితే, తండ్రి ఎవరో, కొడుకు ఎవరో తెలుసుకోవటం కష్టం. కవలపిల్లల్లాగా ఉంటారు.

హౌరా స్టేషనులో దిగి మదనమోహనుడు కుర్రవాళ్ళలాగా ఈలవేయ నారంభించాడు. ఒకళ్లిద్దరు దొరసాన్లు ప్లాటుఫారం మీదనుంచి పోతూ ఉంటే మందహాసం చేసి కన్నుకూడా గీటాడు. తర్వాత గుమాస్తా వంకతిరిగి పకపక నవ్వుతూ — చూడు సర్కార్! నేను ఒక్కణ్ణే ఇంటికి

పోతాను. వాళ్లు నన్ను గుర్తిస్తారో లేదో చూడాలి! నువ్వు బజారు పనులు చూసుకుని, గంటా గంటన్నర అయినాక ఇంటికిరా'' అని చెప్పాడు.

సుమోహన్ వెళ్లిపోయినాక ఆయన ఒక్కడే యింటికి బయలుదేరాడు. అప్పటికి పొద్దు ఆట్టేలేదు; మెల్లెక్కి సరాసరి భార్య గదిలోకి పోయినాడు. కేతకి వాకిలివైపుకు వీపుపెట్టి ఏదో పనిలో నిమగ్నురాలై ఉంది. మేలిముసుగు కూడా జారిపోయింది. బూట్ల చప్పుడు విని తిరిగి చూసి—"ఏమండీ, చీర తెచ్చారా?'' అని అడిగింది—

మదనమోహనబాబు చకితుడైనాడు. ముసుగు లేకుండా కోడలు ఎప్పుడూ ఇలా మాట్లాడలేదు! ఏమిటీ చిత్రం? ఆయన సిగ్గుపడి వెనక్కి తిరిగాడు.

"వెనక్కి తిరిగారు, చీర తేలేదు కదూ? మాట్లాడక పోతే తప్పించుకోవచ్చు ననుకున్నారా?'' అంది కేతకి మళ్ళీ.

మతిపోయిందా ఏమిటి కోడలికి? ఇలా అంటుందేమిటి?

ఆయన జవాబివ్వకుండా భార్యను వెతుక్కుంటూ బయలుదేరాడు. వెనకనుంచి కోడలు ఇలా అంటున్నది—"పారి పోతున్నారే. అమ్మ దగ్గరకే గాదూ? కానీ రండి.''

శివ, శివ! ఇవి మామను అనవలసిన మాటలేనా?

పక్క గదిలో భార్య కళ్ళజోడు పెట్టుకుని ఏదో వ్రతానికి నామాలు వత్తులు చేసుకుంటూ వుంది. బూట్ల చప్పుడు విని, కళ్లు ఎత్తకుండానే — "ఇవ్వాళ యింత ఆలస్యమైందేమిరా బోడీ?'' అంది.

ఈ మాటలు మదనమోహనబాబుకు ఉత్సాహం కలిగిం

చినై. భార్యను దిగ్భ్రమ చెందించాలనే ఉద్దేశంతో పక పక నవ్వాడు. నవ్వు విని, భార్య తల ఎత్తి, కళ్ల అద్దాల పైగా చూస్తూ — "ఎందుకురా నవ్వుతావు?" అని అడిగింది.

ఏమిటి వీళ్లు అనేది! కాయకల్ప చికిత్సతో ఇతను మణిలాలు అయినా ఏమిటి? భార్యకూడా గుర్తించలేదే! నలభై సంవత్సరాలు కాపురం చేసిన భార్యే గుర్తించక పోతే ఇక గత్యంతర మేమిటి? ఎంత చిక్కులో పడ్డాడు వీళ్లు గోలచేస్తే నౌకర్లు వచ్చి దేహశుద్ధి చేయరు కదా? ఇంటివాళ్లే గుర్తించలేకపోతే వాళ్లు మాత్రమెలా గుర్తిస్తారు? ఇప్పుడే పుట్టుకువస్తున్న వారి తలవెంట్రుకలు ఒక్కొ మాటుగా నిక్కి పొడుచుకున్నవి! ఇక ఉపాయం?

మదనమోహనుడు అక్కడినుంచి బయలుదేరాడు. రోడ్డుమీద నిరీక్షిస్తూ, గుమాస్తా వచ్చినాక ఏదో ఒకటి చేద్దామని నిశ్చయించుకున్నాడు. వరండాలోకి వచ్చేవరకు కేతకి "ఏమండీ, రేపు ఉదయమన్నా తెస్తారా?" అంటూ మదనమోహన బాబుకు అడ్డు వచ్చింది.

"ఏమిరా బోడీ, రేపు వారు ఎన్ని గంటల బండికి వచ్చేది?" అంటూ భార్య వెనకనుంచి వచ్చింది. ఇద్దరినీ లౌక్యంగా తప్పించుకుని మెట్లు దిగుతూ ఉండగా మణిలాలు దుస్స్వప్నం మాదిరిగా ఎదురుపడి—"ఎవరు నీవు?" అని అడిగాడు.

మెట్లమీద బాగా చీకటిగా ఉంది. మదనబాబు అస్ఫుటంగా—"నేనే" అన్నాడు.

మెల్లగా జవాబివ్వటం చూసి మణిలాలుకు సందేహం కలిగి—"నేనంటే ఎవరు?" అని అడిగాడు.

"క్లయింటును" అన్నాడు మదనబాబు. ఈ మాట అతనికి తెలియకుండానే నోరు జారింది. ఇతను ప్లీడరుకదా, క్లయింటు అంటే తప్పుకుపోవచ్చుఅని అతని అచేతన మనస్సుకు తట్టి ఉంటుంది.

"ఏమిటీ నా క్లయింటువా?" అని మణిలాలు దగ్గిరకు వచ్చి—"నన్ను టోపీ వేయాలనా?" అన్నాడు.

మదనబాబుకు మతి పోయింది. అలానే నిలబడి పోయాడు. గుండెలు దడదడ కొట్టుకొంటున్నవి. ఆఖరికి కొడుకు చేతిలోనే దెబ్బలు తినవలసివస్తుందా ఏమిటి?

"అక్కడే నిలబడు. ఒక్క అడుగు కూడా కదలకు"అని మణి నౌకర్ను కేకవేశాడు.

"అయ్యా!" అంటూ వచ్చాడు నౌకరు.

"పోలీసు స్టేషనుకుపోయి రిపోర్టుచేసిరా."

మదనబాబు కళ్ళనీళ్ళపర్యంతమై—"నన్ను గుర్తించ లేదా నాయనా, కాయకల్ప చికిత్సతో నే నిలాగయాను. నేనే నీ తండ్రిని; మదనమోహనరాయిని" అన్నాడు.

"వాళ్లు దగ్గర పెట్టుకుని మాట్లాడు. నా తండ్రివిగా?"

ఈ గోలవిని, జడ్జీగారి భార్యా, కేతకీ వరండాలోకివచ్చి నిలబడ్డారు.

"ఏమిరాబోడీ, ఏమిటీగోల?" అన్నది మణిలాలు తల్లి.

"ఇంకా ఏముంది? ఎవడో దొంగ ముండాకొడుకు—"

"ఏమిటీ? దొంగా?"

"కాక! మీారు నిద్రపోతున్నారా ఏమిటి?"

"దొంగ క్రిందకివస్తే మేము ఏమిచేస్తాము?"

"క్రిందకి రావటం ఏమిటి? పైనుంచి దిగివస్తుంటే?"

"అదేమిటిరా! నువ్వేగా ఇప్పుడు పైనుంచి దిగిపోయింది."

"నేనా? నేను ఇప్పుడు కాదూ కోర్టునుంచి రావటం! వీడు మా నాన్నట!"

"ఛీ, ఛీ నువ్వనేది ఏమిటిరా!"

మదనమోహనుడు కొంచెం ధైర్యం తెచ్చుకుని "నిజమేరా అబ్బాయి! నేను మీా తండ్రినే" అన్నాడు.

"మళ్లీనా!" అన్నాడు మణి.

పైనున్న జడ్జీగారి భార్యకు క్రిందవాళ్లు సరిగా కనపడటం లేదు—"అయితే నీవేషంతో వచ్చాడా ఏమిట్రా? నేను ముసలిదాన్నయి గుర్తించలేకపోయినా! అమ్మాయి చాలా సేపు మాట్లాడిందే!" అని క్రిందకు దిగివచ్చింది. వెంట కేతకి కూడా వచ్చింది.

"ఇటు తిరగమనరా, బోడీ! ముఖం చూస్తాను." అన్నది జడ్జీగారిభార్య. ఒకరు చెప్పనక్కరలేకుండా మదనమోహనుడు భార్యవైపు తిరిగి కాళ్లుపట్టుకునే భంగిమలో— "అమ్మా, నన్ను గుర్తించలేదా? నేనే—" అన్నాడు.

మేలిముసుగు కాస్త తొలగించి కేతకి మామనుచూసి, నాలుక కొరుక్కుంది. జడ్జీగారి భార్య వెనక్కుపోయి— ఛీ ఛీ—ఏమిపోయే కాలమొచ్చిందిరా నీకు." అన్నది.

భార్య సమర్థించకపోవటం చూసి మదనమోహనుడు;

కొడుకువైపుకు తిరిగి–"ఎందుకు ఇలా ఆడిస్తావు నాయనా! నేను మదనమోహనుణ్ణి." అన్నాడు.

"ఎలా నమ్ముకుంటామురా బోడీ! సరిగ్గా నీ మాదిరి వేషం వేసుకు వచ్చాడు. కోడలు కూడా మోసపోయింది," అన్నది తల్లి. "నీ కాళ్లు పట్టుకుంటాను అమ్మా?" అని మదనబాబు భార్యవంకకు తిరిగాడు.

"ఛీ, ఛీ–పాతిక సంవత్సరాల కుర్రవెధవ, నా..."

"వీడు బాగా ఆచూకీ తీశాడు అమ్మా! కాయకల్ప చికిత్సతో మారిపోయాడని నమ్ముతారని నా వేషంతో వచ్చాడు. ఎంత దొంగ ముండాకొడుకు" అన్నాడు మణి.

మదనబాబు నిరాశచెంది నేలమీద కూలబడ్డాడు. పోలీసులు వచ్చారు. నౌకరు కుర్చీ తెచ్చివేశాడు. జడ్జీగారి భార్యా, కేతకీ చాటుకుపోయి నిలబడ్డారు.

ఇన్‌స్పెక్టరు కుర్చీమీద తీరిగ్గా కూర్చుని "ఏమిటి సంగతి?" అని అడిగాడు.

మణిలాలు హరిద్వారయాత్ర దగ్గరనుంచి ఇప్పటి వరకు జరిగింది అంతా చెప్పాడు. తర్వాత "చూడండి, ఈ దొంగ వెధవ మోసపుచ్చటానికి ఎంత ఎత్తువేశాడో!" అన్నాడు.

"కాక" అని ఇన్‌స్పెక్టరు మదనబాబు దగ్గిరకువచ్చి–"జుట్టు, పెట్టుకున్నరకంగాఉందే!" అంటూ పట్టుకున్నాడు. "అబ్బ! ఇన్‌స్పెక్టరుగారూ, నేను వంచనచేయటానికి వచ్చినవాణ్ణికాను. వీళ్ళను కొంచెం గమ్మత్తుచేయాలని ఒక రోజు ముందుగా బయలుదేరి వచ్చాను. అసలు మదన బాబును నేనే!" అన్నాడు.

"ఒకరోజు కాదు, ఒక ఘంట ముందుగావస్తే తప్పిం చుకుపోయేవాడివి!" అన్నాడు ఇన్స్పెక్టరు.

ఇంతలో గుమాస్తా వచ్చి–"ఏమండీ బాబుగారూ, నేల మీద కూర్చున్నారెందుకూ?" అని అడిగాడు.

"చూడు సర్కార్, నిన్ను వదలిపెట్టి వచ్చినందుకు నాకు ఎంత శాస్తి అయిందో! వీళ్లు నన్ను నమ్మటమే లేదు." అన్నాడు మదనబాబు.

గుమాస్తా మణిలాలువంకకు తిరిగి–"పోలీసుల్ని పిలిచారెందుకు చినబాబుగారూ?" అన్నాడు.

వ్యవహారం తలక్రిందు లవటంచూసి మణిలాలు విస్తుపోయి నుంచున్నాడు.

"అసలు మేము రేపు రావలసింది. ఇంట్లోవాళ్ళందరినీ దిగ్భ్రమ చెందించాలనే ఉద్దేశంతో బాబుగారు ఇవ్వాళే వచ్చారు. వచ్చినందుకు బాగానే జరిగింది." అన్నాడు గుమాస్తా.

"చూడు సర్కార్! నా భార్యకూడా నన్ను గుర్తించ లేదు. నన్ను ఎంత అవమానించారనుకున్నావు?" అన్నాడు మదనబాబు. గుమాస్తా పోలీసులవంకకు తిరిగి–"తమరు ఇక దయచేయవచ్చు" అని అన్నాడు.

పోలీసులు వెళ్ళిపోయారు. వెళ్ళిపోయే ముందు–"మాదేమీ తప్పులేదు. మణిబాబే మమ్మల్ని పిలిపించాడు." అని చెప్పిపోయారు.

మదనబాబు ఊరుకోలేదు. గుమాస్తాతో—"అదృష్ట వశాత్తు నువ్వు వచ్చావు సర్కార్! లేకపోతే ఈ నాలుగు

పీచులూ లాగేసి పోయేవాడు!'' అని తల తడుముకున్నాడు

'చాల్లెండి, అయినగోల!'' అని మణిలాలు తండ్రిని పిలుచుకుని ఇంట్లోకి తీసుకుపోయాడు.

*   *   *

మణిలాలు తన గదిలోకి పోయాడు. కేతకి సిగ్గుతో తల ఎత్తనేలేదు. మణి భార్యదగ్గరకిపోయి—''ఎందు కలా ఉన్నావు?'' అని లాలించాడు.

''పాడు కాయకల్పం! ఎంత గోల అయిందనుకున్నారు! కాసేపుంటే చేయికూడా పట్టుకునేదాన్ని.''

ఇటు జడ్జీగారిభార్య, భర్తకాళ్లు పుచ్చుకుని-''చేసిన తప్పును క్షమించండి. కాని మీరు నాకు అక్కర్లేదు. మళ్లీ ముసలివాళ్ళయిరండి. నేను యాభై సంవత్సరాలదాన్ని, మీరు పాతికపళ్ళ వారూ అయితే లోకులేమంటారు? కావలిస్తే నేను చచ్చిన తర్వాత కాయకల్ప చికిత్సచేయించుకుని మళ్ళీ ఇంకో పెళ్లి చేసుకోండి'' అని ప్రారంభించింది.

మర్నాటికి పట్టణమంతా గోల.

ఎలా దొరికిందో తెలియదుకాని మర్నాటి దిన పత్రికల్లో వీరి ఇద్దరి బొమ్మా పడింది. ఇంగ్లీషు పత్రికలు పెద్ద పెద్ద హెడ్డింగు పెట్టినవి—

''ఆఫ్టర్ ఎఫెక్ట్స్ ఆఫ్ 'కాయకల్ప' ట్రీట్‌మెంట్ యాన్ ఇండియన్ కపుల్-25 Vs 50''

దేశవాళీ పత్రికలు-''కాయకల్ప చికిత్స ఫలితం : 25 పళ్ళ భర్తా, 50 పళ్ళభార్యా.—హుర్రే!''

(విజయగుప్త)

# కొరతపడ్డ నక్క

నాకు మొదటినుంచీ పరిశుభ్రత అంటే ఇష్టం. గదిలో ఫర్నిచరుదగ్గరినుంచి వేసుకునే గుడ్డలవరకూ శుభ్రంగా ఉంచటానికి ప్రయత్నిస్తాను. నాకీఅలవాటు చిన్నతనంనుంచి ఉండేదట. ఈ సంగతి సమయోచితంగా మా ముసలినౌకరు నాచెవిని వేస్తూ ఉంటాడు. ఇలాంటి నాకు గోవిందఘటక్ లాంటి స్నేహితు డెలా దొరికాడో చెప్పటం కష్టం. అతను కేవలం నాకు విరుద్ధం. గోవిందు అందవికారి కాడు; ఎర్రగా ఉంటాడు. కాళ్ళకి స్లిప్పర్లు, వంటికి రెడీమేడు చొక్కా; ధోవతిమాత్రం ఎప్పుడుచూచినా పది పన్నెండు రోజులక్రితం కట్టుకున్నట్టుగా ఉంటుంది. నేను కనపడితే చాలు అమాంతంగా నా మెడవాటేసుకుని 'ఏంబ్రదర్! విశేషాలేమిటి?' అంటూ వేలాడబడతాడు. అతను తాకితే నా శరీరం గగుర్పొడుస్తుంది — ఓతట్ట చెత్తాచెదారం నా నెత్తిన కుమ్మరించినట్టుగా ఉంటుంది. ఇట్లా ఉన్నప్పటికీ నేను లోలోపల గోవిందుని ప్రేమిస్తాను. కాని మనసులోని పాపంలాగా ప్రజలకంటబడనీయకుండా ఉంటానికిమాత్రం ప్రయత్నిస్తాను.

గోవిందు ఎవరు? ఏమి చేస్తాడంటేమాత్రం నేను వివరాలు చెప్పలేను. గోవిందు చిన్నతనంలో నాతో చదివాడు. ఆ తర్వాత అతను పుగాకుబేరం మొదలుకొని పూజారిత్వం వరకు అన్నివ్యాపారాల్లో దళారీపనిచేశాడు. ప్రస్తుతం అతను ఒక కామవర్ధకమందులకంపెనీకి ఏజంటుగా పనిచేస్తున్నాడు.

సాయంత్రం పని పూర్తికాగానే సినీమా తారలతో ఇంటర్వ్యూలుచేసి, ప్రచురించి తద్ద్వారా భాషాసేవకూడా చేస్తున్నాడు. మరి డబ్బుకు యిబ్బంది వచ్చినప్పుడు నాదగ్గరికొచ్చి 5,10 పట్టుకుపోతూఉంటాడు. అతను నా గదికొస్తేనే చాలు నాకానందం. ఒకేమాటు వీధిభాగవతం, సినీమా, సర్కసు చూసినట్టు ఉంటుంది.

* * *

ఆవాళ ఉదయమే వచ్చాడుగోవిందు. కాసేపు మామూలు ధోరణిలో వాగి 'టేబిలు శుభ్రంగా ఉందే!' అని దాని మీద రెండుకాళ్లూ పెట్టి డబ్బాలో సిగరెట్టు తీసి కాలుస్తూ "ఓ వెయ్యిరూపాయలు అవసరమోయ్!" అన్నాడు.

"ఏందుకోయ్, అన్నిరూపాయలు?" అన్నాను నేను ఆశ్చర్యంతో.

"చెప్పితే ఇస్తావా?"

"నిజం చెప్పితే?"

"రేసుకు పోవాలి. బ్రహ్మాస్త్రంలాంటి 'టిప్' ఒకటి దొరికింది నాకు. అది గుఱ్ఱంకాదు తుపాకిగుండు. నిన్న బీచికి షికారుపోయాను; అక్కడ కనపడ్డాడు జాకీముండా కొడుకు. వాణ్ణి బ్రహ్మాండంగా ఎత్తిపారవేశాను. ఇక మన దానిముందు, గుఱ్ఱాలు కాదుగదా కారుగూడా పనికిరాదు"

"గుఱ్ఱంపేరు?"

గోవిందు మూతి వంకరగా తిప్పి — "ఉహూ, పేరు చెప్పటం కుదరదు. నువ్వేమన్నా కాయదలుచుకుంటే నా చేతికివ్వు. డబ్బు అక్కడ ఊరకనే పడిఉంది—మనం ఏరి

తెచ్చుకోవటమే తడవు! ట్వెంటీ టు వన్' అన్నాడు.

నేను ఇరవై రూపాయ లిచ్చాను. చెరి పదీకాయమని. గోవిందు ఆ ఇరవై రూపాయలూ, ఒక గుప్పెడు సిగరెట్లూ పుచ్చుకుని వెళ్లాడు.

ఆ తర్వాత నాకు రెండుమూడురోజులకు కనపడ్డాడు. బజారులో కనపడటమే తరువాయి నామెడ వాటేసుకుని–"బ్రదర్ నువ్వేమీ అనుకోమాకు; నా తప్పు యిందులో ఏమీ లేదు" అన్నాడు.

"ఏమి జరిగిందేమిటి? అల్సో రన్ అయిందా?"

"ఉహుం, సగందూరానికి వచ్చి వెల్లకిలాపడి చచ్చింది. ఎదిరిగుఱ్ఱంవాళ్లు మందుపెట్టించారని అనుమానం" అని వెళ్ళిపోయాడు.

నేను క్లబ్‌కుపోయి రేసుల్లో పాల్గొంటూఉండే ఒక మిత్రుణ్ణి కనుక్కున్నాను. అతను ఆశ్చర్యపోయి—"లేదే! 1911 లోనో 12 లోనో అమెరికాలో ఒక గుఱ్ఱం అలా చచ్చింది" అన్నాడు.

ఒక వారమైనాక మళ్లీ నాకు గోవిందు కనబడితే "నన్నలా మోసం ఎందుకు చేశా"వని అడిగాను. అతను బలవంతాన నవ్వు తెచ్చుకుని–"ఏమి చెయ్యమంటావు భాయీ! నీదగ్గర డబ్బుతీసుకుని వచ్చానో లేదో కాబూలీవాడు పట్టుకున్నాడు. అవి కాసినీ వాడికి సమర్పించుకుని వళ్లు చెడకుండా తప్పించుకున్నాను" అని గోవిందు ఎవరినో ఉద్దేశించి–"ఏయ్! ఒకమాట!" అని కేక వేస్తూ వెళ్ళిపోయాడు! అతని అవస్థ చూచి నవ్వుకుంటూ నేను ఇంటికొచ్చేశాను.

ఈమధ్య నేను కొన్నాళ్లు ఇంటిదగ్గర లేను. మా ఊరు పోయి తిరిగి వచ్చాను. నేను ఇంట్లో అడుగుపెట్టానో లేదో "కొంచెం ఆగు బ్రదర్! నేను వీడికి కొలతలిచ్చి మాట్లాడతాను" అని గోవిందు నాకు మాట్లాడటానికి వ్యవధి ఇవ్వకుండానే టైలరుకు కొలతలిచ్చి పంపేసి—"నేను వాడి షాపుకే పోతూఉంటే దోవలో కలిశాడోయ్! మళ్ళీ అంతిదూరం పోవటం ఎందుకని ఇక్కడికి తీసుకొచ్చి కొలతలిచ్చి పంపివేశాను" అన్నాడు.

"ఏమిటి వ్యవహారం? నీకెప్పుడూ గుడ్డలుకుట్టించే ఆలవాటు లేదుగా?" అన్నాను.

గోవిందు ముఖానచమట తుడుచుకోటానికి రుమాల కోసం వెతికాడు కాని జేబులో దొరకకపోవటంవల్ల ధోవతి కొంగుతో తుడుచుకుని—"కొత్తఏజన్సీ ఒకటి సంపాదించానోయ్! కొంత పటాటోపం లేకపోతే అది నడిచేటట్టులేదు. ఈరోజుల్లో అట్ట చూసి కాదూ పుస్తకాలు కొనేదీ?" అన్నాడు.

ఆతర్వాత గోవిందు కాసేపు హస్కు కొట్టి వెళ్ళిపోయాడు.

మళ్ళీ గోవిందు నాకు కొన్నిమాసాలు కనబడలేదు. నేనూ నావ్యవహారాల్లో ఉండి అతనిసంగతే మరిచిపోయాను.

ఒకనాటి ఉదయం నేను ఆఫీసుకు బయలుదేరబోతూ ఉండగా జవాను ఒకడు వచ్చి నాకు 250 రూపాయిలకి బిల్లు ఇచ్చాడు, బట్టలదుకాణంది. నాకేమీ అర్థంకాలేదు. బిల్లు పొరపాటున వచ్చిందేమోనని చూశాను — పొరపాటేమీ లేదు; నాపేరు, చిరునామాతోసహా స్పష్టంగా రాసి

ఉంది దానిమీద. నా కాశ్చర్యం వేసి సరా సరి గుకాణానికి వెళ్ళి—"ఇదేమిటి? మీకోట్టు మొహంగానీ, మీ మొహం గానీ నే నెరగను. నా పేర ఈబిల్లెందుకు పంపారు?" అని అడిగాను.

"అదేమిటండీ! మీయింటికి మనిషిని పంపి కోలతలు తెప్పిస్తిని. మీరే స్వయంగా వచ్చి మూడుసూట్లు తీసుకు పోతిరి. పైగా ఏమీ ఎరగనంటారేమిటి?" అన్నాడు షాపువాడు.

నేను వొప్పుకోలేదు. షా పతను దర్జీని పిలిపించి అడిగాడు. దర్జీ నావంక ఎగాదిగా చూచి 'నేను ఈపేరుగల వ్యక్తి యింటికిపోయి కొలతలు తెచ్చినమాట నిజమేగాని ఆ వ్యక్తి ఈయనకాదు' అన్నాడు.

నేను దర్జీని గుర్తించాను. ఇతనే గోవిందు కొలతలు తీసుకుపోయింది. అప్పుడు బోధపడింది నాకు—గోవిందు చేసిన పని. వాడు నా పేరుతోపాటు నా యిల్లుకూడా ఉప యోగించుకున్నాడు కొలతలకు. గోవిందు ఈపనిచేస్తాడని నే నెప్పుడూ అనుకోలేదు. కారణం, వాడికి గుడ్డలు కావలిస్తే అప్పుడప్పుడూ నావి ఎత్తుకుపోతూ ఉండేవాడు! ఏం చేయాలి ఇప్పుడూ?

నాకు రెండేమార్గాలు కనిపించినై—డబ్బు కట్టడమో, లేక గోవిందుని జైలుకి పంపించడమో! నేను షాపువాడితో ప్రస్తుతం, ఆగమనిచెప్పి గోవిందు గదికి పోయాను. అక్కడ వాడు లేడు. ప్రక్కవాళ్ళని విచారిస్తే అందరిదగ్గరా అప్పులుచేసి రెండుమాసాలకిందటే ఎటో వెళ్ళిపోయాడని.

తెలిసింది. ఏం చేసేదీ? విధిలేక బిల్లు నేనే చెల్లించాను. నాకు వాడిమీాద మహాకోపం వచ్చింది—ఈతఫా కనబడితే వాడిచచ్చులు చేతితో కాకపోయినా—మురికి అవ్తై—చిమటాతోనన్నా మెలిపేయాలనుకున్నాను; ఇదేనా స్నేహితుడు చెయ్యాల్సిన పని?

చాలాకాలంవరకు గోవిందు నాకు కనపడలేదు. ఆమధ్య ఎప్పుడో నేను స్నేహితుడితోపాటు కారులో పోతూపోతూ ఒకమాటు అతన్ని చూశాను. అప్పుడు గోవిందు కొంతమంది భక్తబృందాన్ని వెంటవేసుకొని రామదాసుకీర్తనలను పాడుతూ భద్రాద్రికిపోయే యాత్రికులకి చలివేంద్రలు పెట్టడానికి కామాలు చందాలు వసూలుచేస్తున్నాడు. దిగిపోయి వాణ్ణి పట్టుకుందామా అనుకున్నాను ఒకమాటు. కాని మనమే అల్లరి అవుతామని తర్వాత మానుకున్నాను.

నే నంతటితో ఊరుకోలేదు, ఆ సాయంత్రం వాడి గదికి పోయి విచారించాను; లేడు. వాడిని ఎరిగిన ఒకరిద్దరిని కనుక్కున్నాను—మాకు తెలియదన్నారు ఎక్కడ వుండేదీ.

* * *

ఐదారుమాసాలు గడిచినై నే నొకనాడు పీపుల్సు పార్కుకుపోయి కాసేపు తిరిగి అక్కడ ఓ బెంచీమీాద కూర్చున్నాను. ఎరిగినవారెవరన్నా కనబడతారేమో కాసేపు హస్కుకొట్టుదామని చుట్టూచూశాను. ఎవ్వరూ కనబడలేదు. కాని నా చూపునుమాత్రం ఒక ఆంగ్లోఇండియన్ అరికట్టాడు. అతను పడమటివైపు వాకిలినించి పెరాంబులేటరు ఒకటి తోసుకుంటూ వస్తున్నాడు. ఆబండి

నిండా పిల్లలు. ఇంకా కొంద రతని చేతులు పట్టుకొని, కొందరు మెడ పట్టుకొని వేలాడబడుతున్నారు. నాకు గాభరా వేసింది అతనిస్థితి చూసి. ఆంగ్లోఇండియన్ లలో అనెంప్లాయిమెంట్ ఉన్నదని గోల:—ఇలా ఎంప్లాయై ఉన్నవాళ్ళకి వేరేపనులు చేయడానికి తీరికమాత్రం ఎక్కడిది? అనుకున్నాను.

ఆ వ్యక్తి దగ్గరకి వచ్చాడు. అతనికి కొంచెం వెనకాలే, అతని మేం సాహెబ్—నల్లగా లావుగా—55,60 పళ్ళకు మధ్యఉంది—ఏదో పుస్తకం చదువుతూ మామక్ లాగా ఊగులాడుతూ వస్తోంది. ఆమనిషి మొహం చూస్తేనే రత్నగర్భ అని చెప్పవచ్చు. పూర్వకాలంలో మహాపురుషుల భార్యలుమాత్రమే శతపుత్రవతులవే వారట—బహుశా వారుకూడా చూడటాని కిలాగే ఉండేవారుకామాలు. లేకపోతే అంతమందిని ఎలా అమపుచెయ్యగలిగేవాళ్లూ? మహిషాసురమర్దనిలాగా ఉంది రూపం!

పిల్లలతో నానా అవస్థలుపడుతూ ఆ వ్యక్తి ఇంకొంచెం దగ్గరికివచ్చాడు. అరే! వాడు గోవిందే. ఆరి ఖర్మ! వాడి వంటిమీది కోటూ, పంట్లామూ వోదులువోదులుగా ఉన్నై—బహుశా ఇతర్లసొత్తనుకుంటాను. కాళ్ళకు సిపాయి బూట్లూ, నెత్తినహెల్మెటూ, ఏమిటీవేషం?

గోవిందు నన్ను చూశాడు. ఆచూపు చాలా పాథటిక్ గా ఉంది, బహుశా నరకంలో పాపులుకూడా దాంతే వంక ఇలాగే చూసి ఉంటా రనుకుంటాను. గోవిందు ఇద్దరిముగ్గురి పిల్లలచేతులులాగి, వదిలించుకొని నాదగ్గరకువచ్చి—"god!

నను రక్షించు బ్రదర్!'' అన్నాడు:

''ఏమిటీ వ్యవహారం! ఈ నల్లదొరసానీ, పిల్లలూ నీ కెక్కడ దాపురించారు ?'' అని అడిగాను.

''క్షమించు బ్రదర్, నిన్ను మోసగించినతర్వాత నేను తిన్నగా రంగూనుపోయ్యాను. అక్కడ కొన్నాళ్లు నాటక కంపెనీ అదీ నడిపి ఏమీ లాభం లేకపోతే ఇక్కడికి వచ్చాను. ఈమధ్య కొన్నాళ్లు యాంటీబూతుసంఘానికి ఆర్గనైజరుగా పనిచేశాను. ఏమీగిట్టలేదు. ఒకనాడు నేను నీ ఖాతాలో కుట్టించిన సూటు వేసుకొని మూరుమార్కెట్టుకు షికారుగా వచ్చాను. ఇక్కడ పట్టుకుంది ఈ దొరసాని నన్ను. నేను మార్కెట్టు దిగానో లేదో ఏడుస్తూ నాదగ్గరికి వచ్చి, నేను తన రెండో సంబంధం భర్తలాగా ఉంటానని చెప్పింది. నేను కాపాడకపోతే తను చచ్చిపోతా నంది.

''నేను సంగతి ఏమి ?'' టని అడిగాను.

''నా రెండో సంబంధపుభర్త గత యుద్ధంలో పనిచేశాడు. కొన్నిమాసాలైంది, అతను కనపడకుండాపోయి. అతని కొచ్చే పెన్షనుతోటే నేనూ నా పిల్లలూ జీవిస్తున్నాము. నువ్వు అచ్చంగా నాభర్తలాగా ఉన్నావు. నువు పోయి గనక ఆ పెన్షను డబ్బు తెస్తే నాజన్మలో నీమేలు మరవను. ఇందులో అన్యాయ మేమీలేదు. నాభర్తఉంటే డబ్బు తెచ్చేవాడుకాదా'' అన్నది.

''సంతకమదీ ఎలా కుతురుతుంది ?'' అన్నాను.

''మా యింటికి రా నువ్వు. సంతకం చూపిస్తాను. పది యిరవైసార్లు నకలుచేశావంటే కుదిరిపోతుంది. ఎవ్వరికీ

అనుమానం ఉండదు. పోయి డబ్బు తీసుకురావచ్చు''

"గమ్మత్తుగా ఒకనాటకమాడుదామనుకున్నాను నేను. నిజంగా డబ్బు తేగలిగితే దొరసాని నాకు భాగం పెట్టక పోతుందా అనే ధీమా ఉంది నాకు. నేను దొరసానిఇంటికి పోయి సంతకం నేర్చుకొని పెన్షన్ ఆఫీసుకుపోయి నుంచున్నాను, పేరు చెప్పటం తోటే డబ్బు ఇచ్చేశాడు—నా వంక చూడనుకూడా లేదు. పథకం బాగా కుదిరిం దనుకున్నాను. నేను డబ్బుతీసుకుని ఆఫీసు బయటికి వత్తునుగదా దొరసానిచేతిలో డబ్బు కాస్తా తీసికొని "డిక్ ఇంటికిపోదాం పద'' అన్నది.

"పేరుమాత్రం మహాజోక్ గా ఉంది'' అన్నాను నేను.

"జోకేమిటి! ఇవ్వాళనుంచి నువ్వు నాడిక్ వే'' అన్నది దొరసాని.

"ఐతే సరే, నాకు తిండీ, గుడ్డలు ఇస్తూవుండు. బయట గదిలో ఉంటూ నీపెన్షను నెలనెలా తీసికొచ్చి ఇస్తూ వుంటాను'' అన్నాను.

"బ్రదర్, ఆరోజునించే నేనీ దొరసానిచేతికి చిక్కాను. నాకు మోక్షం దొరకలేదు. బయటగదిలో ఉంటాను. ఈ యిరవై మందిపిల్లలు నన్ను 'డ్యాడీ' అని పిలుస్తారు. ఈ ముసలిది నాకు తిండిపెట్టుతూ చాకలి మంగలి ఖర్చు ఇస్తూఉంటుంది. అంతకు మినహాయించి ఒక్కదమ్మిడీకూడా ఎక్కువివ్వదు. నేనేమన్నాగొణిగితే జాగ్రత్త నువ్వు ఫోర్జరీ చేసి గవర్నమెంటుదగ్గరనుంచి డబ్బు తెస్తున్నావు. నాకా డబ్బు ముట్టుతున్నట్లు ఏమీ ఆధారాలు లేవు. కాబట్టి

జాగ్రతగా సంచరించు'' అంటుంది.

''నేను మొదలకుండా అన్నీ సహించుకుంటూ వస్తున్నాను. ఆముసలిదాన్ని ఎదిరించే శక్తి నాకు లేదు. నేను దాని తాబేదారు 'డిక్' నట. ఈ సైతాన్లందరికీ మారుతండ్రి నట. నీకాళ్లు పట్టుకుంటాను, నన్ను రక్షించు బ్రదర్'' అన్నాడు.

గోవిందునికైన శాస్త్రిని చూసి భగవంతుడున్నాడుకదా అనుకున్నాను.

గోవిందు వరఫ్ డిక్ సంతానం నానా అల్లరిచేస్తూ తల్లిని పిలుస్తున్నారు. ఆమె పుస్తకంలో మగ్నురాలై 'డిక్' ఆగింది చూడకుండా ముందుకు వెళ్ళిపోయింది! పిల్లల కేకలికి ఆమెకు స్మృతివచ్చి రొప్పుకుంటూ మళ్ళీ వెనక్కి వచ్చి గోవిందుతో ''డిక్, నీకు సిగ్గువేయడంలేదా, నీకర్తవ్యాన్ని వదలి నేటివ్‌తో మాటాడటానికి?'' అన్నది ఇంగ్లీషులో

లక్షణాలు బాగా లేవని గ్రహించి నేను అక్కడినించి లేచిపోయాను. గోవిందు ఒకమాటు చూశాడు నా వంక. నీళ్ళలో మునిగేవాడికి దగ్గరగా తెప్పకట్ట వచ్చి చేతికి అందకుండాపోతే వాడు ఆ తెప్పవంక ఎట్లా చూస్తాడో అట్లావుంది వాడి చూపు!

(అశోక చటర్జీ)

# పున్నామ నరకం

కుర్రవాడికి ఏమీ నయం లేదు. దగ్గూపడిసెం తగ్గితే గజ్జీ, గజ్జి పోతే లివరు, లివరువాపు తగ్గితే జ్వరము! నాలుగేళ్ళకుర్ర వాడికీ యముడికీ మధ్య లాగులాట పీకులాటగా ఉన్నది. కాళ్ళూ చేతులూ ఊచలైనవి; ముఖం పాలిపోయింది; కళ్లు మాత్రం తళతళ మెరుస్తున్నవి—విశ్వంలో ఉన్న క్లాంతిని, విరక్తినీ ప్రతిఫలింపజేస్తూ. అవి శిశువుకళ్లు కావు; జీవితంలోని సమస్త తిక్తరసాలనూ సేవించి విరక్తిజెందిన వృద్ధుడు ఎవడో వాటిలో దాగున్నాడు; అందులో ఉన్న అసహాయతా, కాతరతా మాత్రమే శిశువువి!

ఎప్పుడూ ఒకటే ఏడుపు, మారామూ! విసుగెత్తినప్పుడు చిత్ర కుర్రవాడిని వీపుమీద చరిచి "చావనన్నా చావవు! కొట్టీకొట్టీ నాచేతులే నొప్పిపుట్టుతున్నై!" అనేది. కుర్ర వాడు ఇంకా ఇంటికప్పు లేచేటట్టు అరిచేవాడు. పక్కమీద పండుకున్న వినయుడు 'మేలుకుని ఉన్నా' నన్నట్టు అటూ ఇటూ పొర్లేవాడు; మాట్లాడేవాడు కాదు. ఇంతకు ముందు ఈ విషయమై భార్యతో పోట్లాడాడుకూడా. కాని ఇప్పుడు ఏమీ అనటంలేదు. భార్య విసుగుచెందటానికి కారణా లేమిటో అతనికీ తెలుసు. అతని హృదయం బాధ పడేది.

కాని గత్యంతరం లేదు. వినయుడు వారఫ్‌లో గుమస్తా. వచ్చేజీతం ఇంటిఖర్చులకే సరిపోదు. డాక్టరుకు ఏమిస్తాడు? అయినా ఆ లోపంకూడా ఉంచలేదు.

కుర్రవాడు ఆకాశం బద్దలయ్యేటట్టు అరుస్తున్నాడు. ఆ

అరుపులో వేదన ఏమీ లేదు—ఈ ప్రపంచంమీద విద్రోహం తప్ప. చిత్ర ఆ కోపంలో ఒక దెబ్బ వేసినా తర్వాత చాలా లాలించి బెల్లించి కుర్రవాణ్ణి మైదుపుచ్చాలని చూసేది. ఈ కేకలకు భర్తకు ఎక్కడ మెలకువ వస్తుందో అని భయ పడేది. పాపం, పగలెల్లా చాకిరీ చేయటంవల్ల ఆమెకూ నిద్ర ముంచుకు వచ్చేది; కుర్రవాడు నోరు మూస్తేకదా! వాడికి లాలింపు అక్కర్లేదు. బొమ్మలు అక్కర్లేదు; తిను బండా రాలు అక్కర్లేదు. వాడి అంతరంగంలో ఉన్న విద్వేష మంతా ఏడ్పుగా బయటికొస్తున్నది. అదేమపు కాదు-సృష్టికి శాపం!

వినయుడు నిద్రపోతున్నట్టు పండుకుని డాక్టరిచ్చిన సల హాను గురించి ఆలోచించేవాడు: "కుర్రవాణ్ణి 'ఛేంజి'కి తీసుకువెళ్లాలట, లేకపోతే లాభంలేదట!—తను ఎలా తీసు కెళ్లగలడు?" ఇక ఆలోచన ఆపి భార్య కుర్రవాణ్ణి లాలిం చటం వింటూ పండుకునేవాడు.

"మా నాయనకదూ, ఏడవమాకు. రేపునీకు ఎర్రటి మోటారు కారు కొనిపెడతాను. నువ్వు దాంట్లో కూర్చుని నడుపుదువు గాని—" కుర్రవాడు ఏమాత్రం ఊరుకునే వాడుకాదు. "నన్నెందుకు కొట్టావు?" అనేవాడు.

చిత్ర కుర్రవాణ్ణిచంకకు తీసుకుంటానికి చేతులు చాపి "మాతండ్రికదూ! మోటారుకారెక్కి 'బంయ్, బంయ్' అని హార్న్ వాయించుదువుగాని" అనేది.

కుర్రవాడు చేతులూ కాళ్లూ నేలకు కొట్టుతూ అదేపాట పాడేవాడు: "నన్నెందుకు కొట్టావు?"

కుర్రవాని మూర్ఖపుపట్టూ, భార్య తెలివితక్కువ లాలింపూచూస్తే వినయుడికి నవ్వొచ్చేది, కాని ఆ లాంతరు వెలుగులో భార్య ముఖంవంక చూసినప్పుడు చాలా బాధ పడేవాడు: ముఖం గోడవైపుకు పెట్టి మళ్ళీ ఆలోచనలో పడేవాడు: "తను వివాహం చేసుకోవటం తప్పా? ఏకాకిగా ఉంటే జీవితం ఇంకా వ్యర్థమయ్యేదికాదా? ఇక మానవుడు కల్పించిన దారిద్ర్యంకోసం జీవితాన్ని నిష్ఫలం చేసుకోటం ఏమంత వివేకం?"

"నన్నెందుకు కొట్టావు?" అనేకుర్రవాడి చీత్కారంతో వినయుని ఆలోచనాశృంఖల తెగిపోయేది. "వీణ్ణి చేంజికి ఎక్కడకు తీసుకుపోవాలి?" వినయుడు అనేక చోట్లు తలుచుకునేవాడు. కాని డబ్బో? భార్యదగ్గరఉన్న నగలెల్లా రెండు గాజులు. అవి అమ్మినా వందకంటే ఎక్కువరావు. వాటితో ఎన్నాళ్ళు గడుస్తుంది?

కుర్రవాడు హఠం మానలేదు. వినయుడు లేచి కుర్రవాడి దగ్గరికి వచ్చాడు. కూర్చుని కునికిపాట్లు పడుతున్న చిత్ర కుర్రవాణ్ణి ఇంకొకటివేసి "కురిందా రోగం? అందరి నిద్రా పాడుచేశావు! ఎక్కడినించి పుట్టుకొచ్చావురా, నా కడుపున రాక్షసుడివి," అన్నది.

"అబ్బ! మళ్ళీ కొట్టేవెందుకు?" అన్నాడు వినయుడు.

"కొట్టను! అర్ధరాత్రిపూట దొంగలు పడ్డట్టు కేకలుపెట్టి ఇరుగుపొరుగును లేవగొట్టుతూ ఉంటే?"

"వాడిని అనేదేముంది? రోగంతో తీసుకుని తీసుకుని అట్లా ఏడుపుగొట్టువాడయాడు!" అని కుర్రవాణ్ణి ఎత్తుకో

టానికి చేతులు చాచాడు. వాడు తండ్రిదగ్గరికి రావటానికి ఇష్టపడలేదు. తల్లికొంగు గట్టిగా పట్టుకుని ఏడవసాగాడు.

చిత్ర కొంగు విదిలించి లాక్కుని "చావనన్నా చావవు, పీడా వదిలి పోయేది!" అన్నది.

"ఛీ! ఏమిటామాటలు చిత్రా!" అన్నాడు వినయుడు.

చిత్ర ఏడుపుపర్యంతమై, "ఇంకా ఏమన మంటారు? వాడు బతికేవాడు కాడని నాకు తెలియదూ? తీసుకు తీసుకుని పోయేవాడుపోక, నన్నుకూడా వెంట తీసుకుపోతాడు." అని చాటుగా కళ్ళు తుడుచుకున్నది.

కుర్రవాడు వినయుని చంకలోనుంచి బలపాల్లాంటి చేతులు చాపి 'అమ్మదగ్గిరికి పోతా' నని చీత్కారం చేయసాగాడు.

"ఛేంజికి తీసుకుపోతే నయ మవుతుందని డాక్టరుగారు చెప్పారు."—ఈమాట భార్యను ఓదారుస్తుందని వినయునికి నమ్మకంలేదు. అసలు అతనికే లేదాయె!

చిత్ర జవాబివ్వలేదు కుర్రవాణ్ణి భర్తదగ్గరనుంచి తీసుకుని, పక్కమీద పండుకోబెట్టి "నోరుమూస్తావా, లేదా? ఈదఫా అరిచావంటే తలుపు తీసి రోడ్డుమీద పారవేసి వస్తాను." అని కుర్రవాడిపక్కనే, పండుకుని భర్తతో "మీరు వెళ్లి పండుకో రాదూ? రాత్రంతా మేలుకుంటే ఎలా? పగలంతా పని చేయాలాయె—ఇలా ఐతే బండి ఎన్నాళ్లు సాగుతుంది?" అన్నది.

వినయుడు పక్కమీద పండుకుని "నువ్వు ఒక్కకునుకూ వేయలేదుగా!" అన్నాడు.

"నేను పండుకుంటినిగా, ఇక నిద్రపోతాను."

కాని ఆమెకు నిద్రపోయే అదృష్టం పట్టలేదు. కుర్రవాడు కొత్తరకం పాఠం సాగించాడు: "నువ్వు పండుకున్నా వెందుకు? ఇదిగో, ఇక్కడ కూర్చో!" అన్నాడు వేలుతో చూపిస్తూ.

వాడు చూపించినచోట చిత్ర కూచో వలసిందే. బతి మాలినా. బెదరించినా లాభంలేదు.

"మా చిట్టివికదూ! భలేనిద్ర వస్తున్నది: కాసేపు నడుం వాలుస్తాను—అక్కడే పండుకుంటానులే. ఏం?"

ఉహుఁ! పండుకోను వల్లకాదు; కూర్చోవలసిందే. "పండుకున్నా వెందుకు? కూర్చో!"

వీడి మారాము చూస్తే వినయుడికి కష్టమేసేది. లేచి "వాడి నిట్లా యివ్వు బజార్లో తిప్పుకొస్తాను." అన్నాడు.

"మీరు మళ్ళీ ఎందుకు లేచారు?" అన్నది చిత్ర విసుగుతో.

"వాడిపోరు తగ్గలేదుగా."

"అందుకని అర్థరాత్రిపూట రోడ్లమీద తిప్పుతారా? మీరు పోయి పడుకోండి."

వినయుడు పక్కమీద పండుకునేవాడు. నిద్రా, విశ్రాంతీ లేక వాడిపోయిన భార్యముఖంవంక చూడలేకపోయేవాడు. గోడవైపుకుతిరిగి పండుకుని చేంజికి తీసుకువెళ్ళటానికి డబ్బు ఎలా దొరుకుతుందా అని ఆలోచించేవాడు.

తర్వాత ఎప్పుడో కునుకుపట్టేది. కాని కుర్రవాడి కేక లతో మెలకువ వచ్చేది. లేచి చూస్తే చిత్ర మంచానికి తల ఆనించి కూర్చుని నిద్రపోతూ వుండేది. కుర్రవాడు చేతుల్లో

జుట్టుపీకుతూ, కాళ్ళతో తలను తన్నుతూ "నువ్వు నిద్ర పోయూ వెందుకూ? లే!" అని అరుస్తూండేవాడు.

*  *  *

ఇలా గడచిపోతున్నవి రాత్రులూ, పగళ్ళూ! ఒకమాదిరి రేకుల ఇల్లు: వంటకు పాకా, కాస్త కాళీజాగా—ఇదే వీరి ఆస్తి. వారింటికి దగ్గరలో ఉన్న పంపుదగ్గర పేరు లేని మొక్క ఒకటి మొలిచింది. ఈ శీతకాలంలో అది బాగా పుష్పించింది. కాని వాటికి అందమూ లేదు, గంధమూ లేదు. అయినా దానికి అలంకారం అదే—బీదకుటుంబీకుల ముఖాన నవ్వుమాదిరిగా!

వినయుడు మొదట్లో పితృఋణం తీరుతుందని సంతోషించాడు. కాని ఇప్పుడు అదికూడా తీరేట్టు లేదు. భార్య ముఖం వంక చూడ లేకుండా ఉన్నాడు. పాపం! మెడ యెముక వెళ్ళుకొచ్చింది—కళ్లు పీక్కుపోయినవి! ఇంట్లో చాకిరీకీ, కుర్ర వాడి సేవకూ నలిగి పంథొమ్మిదేళ్ళ చిత్ర నలభై యేళ్లదాని లాగా అయింది. కుర్రవాడు రోజురోజుకూ మృత్యువువైపే మొగ్గుతున్నాడు.

ఆవాళ డాక్టరుగారు దోవనుపోతూ కారు దిగి ఇంటికొచ్చి, దగ్గర బంధువుమాదిరిగా—"ఇంకా కుర్రవాణ్ణి ఛేంజికితీసుకుపో లేదా? మీరు వాణ్ణి బతకనిచ్చేటట్టు లేరు!" అని పోయాడు.

డాక్టరు పోగానే వినయుడు భార్యతో—"డాక్టరుకు మన మీద ప్రేమ కలిగిందకుకుంటాను, చిత్రా! మనతో డాక్టరు మాదిరిగా వర్తించడు, కాదూ?" అన్నాడు.

డాక్టరుగారి సహృదయాన్ని గురించి కాసేపు చర్చించు

కున్నారు. ఎలాగైనా సరే డబ్బు సంపాదించి నాలుగైదు రోజుల్లోనే కుర్రవాణ్ణి ఛేంజికి తీసుకు వెళ్ళాలని వినయుడు నిశ్చయించు కున్నాడు. చిత్ర నీళ్లు తేవాలని పైపు దగ్గరికి వెళ్లింది. డాక్టరుగారి ఈ క్షణిక అభినయంతో వీరి హృదయ భారం కొంత తగ్గింది.

* * *

అయినా అ దెంత సేపు!

పొద్దుకూకింది. వినయుడు బడలికతో ఆఫీసునుంచి ఇంటికి చేరుకున్నాడు. కుర్రవాడిపోరు మామూలే. తల్లికొంగు పుచ్చుకొని వదలడు.

"నేను వంటా గింటా ఏమీా చేసుకోవద్దూ! ఇలా నీతో కూర్చుంటే ఎలా జరుగుతుంది?" అని చిత్ర కొంగు వద లించుకోవాలని చూస్తున్నది. కుర్రవాడు శోకంపట్టాడు.

"నువ్వు కూర్చోరాదూ? నేను బజారుకుపోయి పూరీలు తీసుకొస్తాను. వాడిదగ్గరే ఉండులే." అన్నాడు వినయుడు వాడి ఏడుపుచూసి.

"రెండుకోసులనుంచి నడిచివచ్చి ఈ వానలో మళ్లీ బజా రుకు ఎక్కడ పోతారు? కుర్రవాడి నంత నెత్తి కెక్కించుకో నక్కర్లేదు లెండి! పైగా మీాకు బజారువస్తువులు సరిపడవు."

"ఒకరోజుతింటే ఏమీా ప్రాణంమీాదికి రాదులే! అసలు–"

"అక్కర్లేదు. నేను వండటానికి పోతున్నాను. ఈ వానవం బజారు కెక్కడపోతారు?" అని చిత్ర కుర్రవాణ్ణి బలలో తాన వదలించుకుని లేచింది. కుర్రవాడు చేతులూ, కాళ్లూ ఝాడిస్తూ ఏడవటం సాగించాడు.

వినయుడు ఇక ఏమీ మాట్లాడకుండా బయటికి వచ్చాడు. టప టప వానచినుకులు పడుతున్నవి. రోడ్డంతా బురద. వినయుని కాళ్ళు బురదలోనుంచి లేచేవి కావు!

ఈ కుర్రవాని భారం వహించలేక ఈ కుటుంబం అణిగి పోతున్నది. ఈ శిశువుయొక్క అంధస్వార్థము అనుక్షణమూ బలికోరుతున్నది.

"శిశువు అంటే భవిష్యత్ మానవుడు. వాడికి అన్నికోరేఅధికారమున్నది. వాడికోసం ఏ త్యాగమైనా చేయాలి" అనుకునేవాడు వినయుడు.

ఇంకోనాడు డాక్టరుగారు వచ్చి తల్లిదండ్రులు శిశువుల యెడల చూపవలసిన బాధ్యతను, కర్తవ్యాన్ని గురించి ఉపన్యసించి పోయాడు; ఈమాటు సహృదయంతో కాదు, అధికారరీత్యా! వెళ్లేటప్పుడు—"చూడండి, తన సుఖంకోసం కర్తవ్యాన్ని వదలినవారిని జైలుకు పంపటం న్యాయం. చెప్పండి! నిజమంటారా, కాదా?" అని పోయాడు.

వినయుడు యథాప్రకారం ఆఫీసుకు పోతున్నాడు; వస్తున్నాడు. అతని ముఖం రాయిమాదిరిగా కఠినమైంది. మనసులో ఏ మాలోచించుకున్నాడో ఎవరికి తెలుస్తుంది?

* * *

కుర్రవాడికి నయమైంది. ఇంకేమీ ఆదుర్దా లేదు. వినయుడు వరండాలో ఈజీచేరులో పండుకుని కుర్రవాడి ఆటలు చూస్తున్నాడు. చిత్ర కుర్చీవెనక నిలబడి "అబ్బ, ఎంత మంచి చోటండి. మళ్ళీ నాకు కలకత్తా వెళ్ళ బుద్ధి పుట్టటంలేదు" అని, భర్త చెవిదగ్గరకు వంగి నవ్వుముఖంతో

"నిన్న కుర్రాణ్ణి ఎత్తుకుంటే చేతులు జిమ్ముమన్నవి!" అంది.

ఈ గరపభూమిరంగు చిత్ర చెక్కిళ్ళకూ, చెట్లలోని సజీవత్వం చిత్రవొంటికీ బాగాపట్టింది. వినయుడేంమాట్లాడలేదు.

చిత్ర కాసేపుండి కేకపెట్టింది: "ఒరే చిట్టీ! వాణ్ణి వదలిపెట్టు—అసలే బక్కప్రాణం!"

చిట్టి తనతో ఆడుకునే కుర్రవాడి వీపుమీద ఎక్కి తలమట్టిలో కూరుతున్నాడు. వినయుడుపోయి వదలించిందాకా వదలలేదు.

కిందపడ్డకుర్రవాడు లేచి దుమ్ము దులుపుకుని ఏడవకుండా ముఖాన నవ్వు తెచ్చుకుని "చూడండి కక్కయ్యగారూ! చిట్టి నన్ను మోయమంటాడు. నేను మోయగలనటండి!" అన్నాడు.

కుర్రవాడిపేరు రఘు, పొరుగువారి అబ్బాయి. జబ్బుగా ఉంటే తండ్రీవాళ్లు ఇక్కడికి తీసుకు వచ్చారు. చక్కని ముఖం; ఎప్పుడూ నవ్వుతూ ఉంటుంది. వినయుడు వీడితో తన కొడుకును పోల్చుకుని సిగ్గుపడ్డాడు. కొడుకును గదుముతూ "ఎందుకూ వాడితల మట్టిలోకూరింది? పోట్లాడంది ఉండలేవూ?" అన్నాడు.

చిట్టి కళ్లూ ముఖమూ ఎర్రచేసుకున్నాడు. "పోట్లాడుకోలేదండి! చిట్టి గుర్రపుఆట ఆడుకుందామంటే నేను మోయలేనన్నాను. నాకేమీ దెబ్బ తగలలేదు!" అన్నాడు రఘు.

"జాగ్రత్త. వాడినెప్పుడూ అంటుకోకు!" అని వినయుడు వరండాలోకి వచ్చాడు.

"మన అబ్బాయికీ రఘూకూ కలవదు..." అని భర్త గంభీరముఖంవంక చూసి చప్పున ఆగింది చిత్ర.

ఆమాట నిజమే. రఘు ఎంత లాలించినా బతిమాలినా చిట్టి వినేవాడుకాడు. ముఖం మాడ్చుకుని, సందు చిక్కగానే తొడ మెలిపెట్టి పరిగెత్తేవాడు.

రఘు ఏడ్చేవాడు. చిత్ర వాడిని చంకకు తీసుకుని కొడుకును గదిమేది. వినయుడు మాత్రం కుర్చీలోనుంచి లేచేవాడుకాదు. ఆతని ముఖం వేదనతో నల్లబడేది. రఘు ఏడుపు చాలించి అతని దగ్గరకు వచ్చి "కక్కయ్యా! చిట్టి నన్ను కొట్టాడు. రేపటినించి ఆడుకోటానికి రాను!" అని చెప్పేదాకా మాట్లాడేవాడుకాడు. శూన్యంవంక చూస్తూ ఏమాలోచించేవాడో!

రఘు మళ్ళీ సాయంత్రం వచ్చాడు.

వినయుడు అప్పుడు కొడుక్కు చదువు చెప్పుతున్నాడు. అరగంట శ్రమపడినా చిట్టికి అక్షరం రాకపోయేవరకు హతాశుడైనాడు. రఘువచ్చి పక్కనే కూర్చున్నాడు. వినయుడు "రఘూ! నువ్వు 'అ' రాయగలవా?" అని అడిగాడు.

రఘు నవ్వి "ఆఁ! కక్కయ్యగారూ! నేను బాలశిక్ష అంతా వప్పగించగలను" అన్నాడు.

"నువ్వు బాలశిక్ష చదువుతున్నావా?" అన్నాడు వినయుడు ఆశ్చర్యంతో.

"పూర్తికూడా అయిందండి. 'అ' రాయమంటారా?" అని రఘు పలకకోసం చేయి చాచాడు.

చిట్టి పలక ఇవ్వలేదు. గట్టిగా పట్టుకుకూర్చున్నాడు.

"చిట్టిని పలకివ్వమని చెప్పండి కక్కయ్యగారూ! నేను అక్షరాలు బాగా రాస్తాను" అన్నాడు రఘు.

"వద్దులే! వాడు రాసుకుంటాడు. నువ్వింటికి పో!" అన్నాడు వినయుడు పరుషంగా. ఈమాట వినేవరకు పాపం రఘుముఖం వెలవెల పోయింది. కిక్కురుమనకుండా ఇంటికి పోయాడు.

కాసేపటికి చిత్ర ఇంట్లోనించి వచ్చి "మధ్యాహ్నంనుంచి వాడినే పెట్టుకు కూర్చున్నారే! జడ్జీని చేయందీ వదలరా ఏమిటి?" అన్నది.

"ఊ" అన్నాడు వినయుడు గంభీరంగా.

*　　　*　　　*

రఘు రెండు రోజులనుంచి రావటం లేదు. వినయుని సిగ్గుకూ, దుఃఖానికీ అంతు లేదు. కుర్రవాణ్ణి వెంటపెట్టుకుని వాళ్ళ ఇంటికి కూడా పోవా లనుకుని మధ్యలోనే తిరిగి వచ్చాడు. తనముందే తనతల కొట్టేసి నట్టున్నది అతనికి.

మూడోనాడు బయటికి వెళ్లుతూండగా, రఘు గేటు చాటున నిలబడి లోపలికి తొంగిచూస్తూ వినయునికంట పడ్డాడు. 'రఘూ!' అని పిలిచాడు వినయుడు.

దొంగతనంచేస్తూ పట్టుబడ్డవాడి మాదిరయాడు రఘు. పారిపోవాలని చూస్తున్నాడు.

"చిట్టితో ఆడుకోటానికి రావటం లేదేమి, రఘూ?"

ఈమాటలో ఉన్న ఆదరంతో రఘూకు ధైర్యంవచ్చింది. "మీరు కోప్పడరుకదూ కక్కయ్యగారూ?" అన్నాడు.

వినయుని కళ్ళలో నీరు తిరిగింది—ఈరోగిష్టి కుర్రవాని

మాటలూ చేష్టలూ చూసి! వినయుడు రఘూను ఎత్తి ముద్దు పెట్టుకుని "ఎందుకు కోప్పడతాను బాబూ!" అన్నాడు.

రఘు ముఖం ఆనందంతో వికసించింది. "అయితే ఆడు కోటానికి పోవేఁదీ?" అన్నాడు.

"పో!" అని వినయుడు దించాడు; రఘు సంతోషంతో పరిగెత్తాడు.

రెండురోజులకు చెల్లుగా ఇవ్వాళ వినయుడు ఉల్లాసంగా షికారుకు పోయాడు. కాని తిరిగి వచ్చేవరకు ఆ ఉల్లాసం పోయింది. వాకిట్లో ఉండగానే కొడుకు కర్కశస్వరం వినిపించింది:—"ఉహుఁ! వాడికి రెండివ్వటానికి వల్లకాదు. ఏం, వాడింటికిపోయి తినలేడూ? ముష్టివెధవ!"

లజ్జతో, వేదనతో, కోపంతో వినయుని ముఖం ఎర్ర బడింది. కాస్త కుర్రవాడిలో ఇంత అసూయ ఎక్కడనుంచి వచ్చిందా అని ఆలోచించుకుంటూ గదిలోకి పోయాడు. "చూడు, నాయనా! అంత కుళ్లుమోతుతనం ఉండకూడదు. వాడు నీకు తమ్ముడు కాదూ! రెండు కాకపోతే ఒక్కటిస్తాను" అని భార్య, కొడుకును ఓదార్చటం గదిలోనుంచే వింటున్నాడు. "నాకు ఒక్కమిఠాయి ఉండ చాలు పిన్నీ! జబ్బుకాదూ, అరగదు" అని రఘూ అనటంకూడా విన్నాడు.

"సరే నాయనా నువ్వొకటితీసుకో; మాచిట్టికి రెండు. సరేనా?"

కాని అది యివ్వటంకూడా చిట్టికిష్టంలేదు. "ఉహుఁ, వాడికివ్వటానికి వీల్లేదు. ఇవ్వు చూద్దాము. వాడిచేతిలోనుంచి లాక్కోపోతే!" అన్నాడు.

"లాక్కో, చూస్తాను! నీకు రెండిస్తేను పాపమని, వాడి చేతిలోది లాక్కుంటావా?" అన్నది చిత్ర కోపంతో.

"వాడికి మన మెందు కివ్వాలి? నాన్న వెళ్ళగొట్టెనుగా, మళ్ళీ ఎందు కొచ్చాడు?"

"బాగానే వస్తాడు! బాగానే తింటాడు!"

ఇది మామూలు విషయమే! మామూలు పాటే! వినయునికి అసహ్యమేసిపోయింది. అతని జీవితస్వప్నాలూ, ఆశలూ తుడుచుకుపోయినట్లయినవి. మెదలకుండా లేచి వాకిట్లోకి వచ్చి నిలబడ్డాడు.

చిత్ర రఘు చేతిలో మిఠాయిఉండ పెట్టింది. "నాకంతా అక్కర్లేదు పిన్నీ!...నాకు ఆకలి లేదుకదూ!" అన్నాడు రఘు. కాని ఆమాట పూర్తికాకముందే చిట్టి వాడిచేతిలోని ఉండ వొడిచి లాక్కుని "ఇస్, నీకు ఉండ కావాలీ?" అన్నాడు.

చేయి నొప్పి పుట్టి రఘు ఏడ్చాడు. చిత్ర కొడుకు వీపు మీద ఒకటి వడ్డించింది. వినయుడు వచ్చిన విధంగానే మెదలకుండా మళ్ళీ గదిలోకి వెళ్లాడు.

*   *   *

"వాళ్ళ రఘూకు ప్రమాదంగా ఉన్నదటండీ!" అన్నది చిత్ర వచ్చి. వినయుడు సందెచీకటిలో వరండాలో కూర్చుని "ఎవరికి, రఘూకా?" అన్నాడు.

"ఆఁ. వాళ్ళమ్మ ఏడుస్తున్నదండి. ఇంతమంచిచోటు కొచ్చినాకూడా కుర్రవాడు బాగుపడలేదు. రోజురోజుకూ దిగజారిపోయాడు."

వినయుడు మాట్లాడలేదు. కొండలవంక చూస్తూ ఉండి

పోయాడు. కాసేపు ఉండి చిత్ర ఇంట్లోకి పోబోతూఉండగా కొంగుపట్టుకుని ''మాట!'' అన్నాడు.

''ఏమిటి'' అని చిత్ర అడిగింది.

వినయుడు మళ్ళీ ఏమీ మాటాడలేదు. ''ఏమి చేపుతారో త్వరగా చెప్పండి, నాకు చాలా పనులున్నై'' అన్నది చిత్ర.

''మన అబ్బాయికి బాగా నయమైనట్టేకదా చిత్రా?'' అన్నాడు వినయుడు—కుర్చీ చిత్రవైపుకు తిప్పి.

''అలాగే కనపడుతున్నది.''

''నీకు చాలా సంతోషంగా ఉందికాదూ?''

''ఏమిటండి ఆ తలా తోకా లేని మాటలు? ఎవరన్నా అడుగుతారూ ఇలాంటివి? కుర్రవాడికి నయమైనందుకు మీకు సంతోషంగా లేదా ఏమిటి!''

నిట్టూర్చాడు వినయుడు; ఏమీ మాట్లాడలేదు. చిత్ర మళ్ళీ, పోబోతూఉండగా కొంగుపట్టుకుని ఆపి ''ఈ కుర్ర వాడే రేపు పెద్దవాడవుతాడు, సంసారం చేస్తాడు—కాదా చిత్రా?'' అన్నాడు వినయుడు.

చిత్రకు ఇతని గొంతు అస్వాభావికంగా తోచింది!

''ఏమిటీ మీరు చెప్పేది? తెలిసేట్టన్నా చెప్పండి!'' అంది.

''చూడు! ఈ కుర్రవాడే ముందు మనకు ఆధారం. పుత్ర పౌత్రాదిపర్యంతం ఈ భూమిని అనుభవిస్తాడు. అందుకనే ఈ మన ప్రయత్నాలు, త్యాగం, తెలిసిందా?''

''ఊరుకోండి. మీ వెటకారమూ, మీరూను!'' అని చెంగు గుంజుకుని చిత్ర వెళ్ళిపోయింది. వినయుడు ఆ అంధ

కారంలోనే కూర్చుని, బహుశా భవిష్యత్తును ఊహించుకున్నా డనుకుంటాను.

కొన్నాళ్లు గడిచినాక, అర్ధరాత్రిపూట ఏడుపు విని చిత్ర లేచి భర్తను లేపి "ఏమన్నా వినపడుతోందా?" అని అడిగింది. "ఊఁ" అన్నాడు వినయుడు.

"రఘూవాళ్ళ ఇంట్లోనించేకాదూ"? అన్నది వెలవెల పోయిన ముఖంతో.

"అట్లాగే ఉంది" అని వినయుడు మంచందిగి కిటికీదగ్గరకు పోయి నిలబడ్డాడు. తర్వాత ఇంట్లో పచారుచేస్తూ హఠాత్తుగా ఆగి "రఘు చచ్చిపోవటం, మన అబ్బాయి బతకటం ఆశ్చర్యంకాదా చిత్రా" అన్నాడు వికృతస్వరంతో.

చిత్ర జవాబివ్వలేదు; ఒక్కమాటు కంపించింది. వినయుడు తలవంచుకుని పచారుచేస్తూనే చెప్పసాగాడు: "మన మెంతో త్యాగంచేశాము; ఎన్నో కష్టాలు సహించాము; మనబ్బాయి తప్పక బతుకుతాడు చిత్రా! వీడేకాదు; వీడిలాంటివాళ్లు ఇంకా కోట్లమంది బతుకుతారు! కొట్టుకుని చంపుకుని ప్రపంచాన్ని కలుషితంచేస్తారు. లేకపోతే మన శ్రమంతా వృథాకాదా!"

గొంతు చాలా అస్వాభావికంగా ఉంది.

"మీకు పిచ్చిఎక్కిందా ఏం?" అన్నది చిత్ర విసుగుతో

"అలానే అనుకుంటాను!" అని చిత్ర చెయ్యి గట్టిగా పట్టుకుని "ఇక్కడికి రావటానికి డబ్బు ఎక్కడిదో ఎరుగుదువా? పిల్లవాణ్ణి పుట్టించిన బాధ్యత ఎంతపని చేయించిందో తెలుసుకున్నావా?" అన్నాడు కర్కశస్వరంతో.

"ఎక్కడ తెచ్చావేమిటి?" అన్నది చిత్ర భయంతో

"దొంగతనం చేశాను; చాటుగా ఓడలోవచ్చిన బేలు అమ్మాను. భవిష్యత్ మానవుని హక్కులముందు ఇది తప్పుపని కాదు కదూ!"

"కొంప మునుగుతుందా ఏమిటి?" అన్నది చిత్ర కంపిస్తూ.

వినయుడు కర్కశంగా నవ్వి "ఏమీమునగదు, భయపడ మాకు! అసలు అక్కడే ఉంది గమ్మత్తు! ఈ దొంగతనం బయట పడదు; చిరకాలం నన్ను అంకుశంతో పొడుస్తూ ఉంటుంది!" అన్నాడు.

వినయునిలో ఆకస్మికంగా వచ్చిన ఈపొంగు వెంటనే చల్లారిపోయింది. బయటికి వచ్చి శీతలస్నిగ్ధ అంధకారంలో మౌనంగా కాసేపు నిలబడ్డాడు. అతని ప్రవర్తన అతనికే ఆశ్చర్యం కలిగించింది—ఇంత ఆవేశం చెందాల్సిన అవసరం లేదని అతనికి తోచింది.

విశాల ఆకాశం నక్షత్రాల ప్రకాశంలో గగుర్పొడిచి నట్టు ఉంది. కింద క్షమాధరిత్రి యుగయుగాలనుంచి అనేక సార్లు హతాశ చెందీ, నేటికీ ఓర్పు పోగొట్టుకో లేదు!

మరి—?

(ప్రేమేంద్రమిత్ర)

# పేకయిల్లు

అమరుడు చాలా మోజుగా నాలుగు రూపాయలు పెట్టి టీ సెట్టు కొన్నాడు. ఆరు కప్పులూ సాసర్లూ కెటిలూ—అన్నీ పింగాణీవే! అమరుడితల్లి వాటిని ప్రాణప్రదంగా చూసు కొంటున్నది. ఎవరైనా బంధువులూ మిత్రులూ వస్తేగాని బయటికి తీయనిచ్చేది కాదు—అల్మారులో దాచేది.

కలకత్తా నుంచి హరన్ బాబు స్వగ్రామం వచ్చాడు. అమరుని తల్లి ఆయన భార్యాబిడ్డల్ని విందుకు ఆహ్వానించింది. అందుచేత వీరింటో హడావిడిగా ఉన్నది.

"టీసెట్టు బయటికి తియ్యి గౌరీ!" అన్నది అమరుని తల్లి.

గౌరి అమరుని చెల్లెలు ఇంకా పెళ్లి కాలేదు. తల్లిదగ్గర నుంచి తాళపుచెవి తీసుకుని గౌరి అల్మారా తెరిచి టీ సెట్టు తెచ్చి అన్నది: "ఐదు కప్పులే ఉన్నాయమ్మా! ఇంకొకటే మైంది? ఇదిగో, ఇప్పుడే చూసుకో, ఆనక నామీద వేస్తావు!"

"బాగా చూడవే, ఏమూలనో ఉంటుంది. రెక్కలొచ్చి ఎగిరి పోయిందా ఏమిటి?" అన్నది తల్లి.

గౌరి టీ సెట్టు అక్కడ పెట్టి మళ్ళీ అల్మారం అంతా వెతి కింది. "రెక్కలొచ్చినయ్యో, ఎవరన్నా తిన్నారో, నాకేమి తెలుసు! ఎంత వెతికినా కనపడలేదు." అన్నది మళ్ళీవచ్చి.

తల్లి ధుమధుమ లాడుతూ—"నీకు కళ్లు నెత్తిమీద ఉంటే కిందవస్తువు లెందుకు కనబడతై!" అంటూ అల్మారా దగ్గరకు పోయింది.

గౌరికి కళ్ళు నెత్తిమీద ఉండేమాట నిజమే, కాని యీ

విషయంలో ముఖంమీదనే ఉన్నవి, ఎంత వెతికినా కప్పు దొరకలేదు. అమరుని తల్లి "పిల్లా!" అని పిలిచింది.

పిల్ల అమరుని భార్య, శైల. మేడమీద ఊడ్చి, అతిథులు కూర్చోటానికి కుర్చీలు వేస్తున్నదల్లా దిగివచ్చి "పిలిచారా?" అన్నది అత్తతో.

అత్తది ఇప్పుడు కావిడిపెట్టె పెత్తనమే—ఇనప్పెట్టె చెవి ఎప్పుడో కొడుకుల చేతికి పోయింది. కప్పు కనపడక పోవడం వల్ల అసలే ధుమధుమ లాడుతున్నది, ఆ మాట వినగానే పేలగింజమాదిరిగా ఎగిరిపడింది. "ఆఁ. రాచబిడ్డా! పిల్లా అని ఎరికెలదాన్ని పిలిచాననుకున్నావా, యానాదిదాన్ని పిలిచా ననుకున్నావా?"

శైల మాట్లాడకుండా ఊరుకున్నది, జవాబిచ్చే అలవాటు ఆమెకు లేదు.

"కప్పు ఒకటి కనబడటంలేదు. ఏమైంది?" అన్నది అత్త.

శైల కాసేపు మాట్లాడకుండా ఊరుకుని "నేనే పగలగొట్టా నత్తయ్యా!" అంది. అత్త కాసేపు శైల ముఖం వంక చూసి–"మంచిపని చేశావు! ఇంకేమనేది?" అంది.

ఆ మాట నిజమే. నిష్కపటంగా తప్పు ఒప్పుకున్నాక అపరాధిని క్షమించటం తప్ప ఇంకేమి చేయటానికి వీలుంటుంది? అత్త గదితలుపు విసురుగా వేస్తూ "ఆ నాలుగూ నేను పగలగొడతాను. పీడా వదులుతుంది," అని కోపమంతా టీ సెట్టుమీద చూపింది,

శైల అన్నీ సహిస్తూంది, ఎదురు చెప్పదు. అత్త మళ్లీ అన్నది: "పగలగొట్టానని ఒప్పుకున్నావు, బాగానే ఉంది.

ఇంకా నుంచోవట మెందుకు? పోయి వంటపనులు చూడ కూడదూ?" శైల పైకపోయి కుచ్చీలుసర్ది, వంట చేస్తున్న అత్తదగ్గరకు వచ్చి నవ్వుతూ నుంచున్నది. అత్తకోపం అప్పటికి తగ్గిపోయింది.

"రా, మీ దేశపుకుండీవంటలు చేస్తాన్నగాని అన్నది అత్త.

శైల కూర్చుని—"అన్నిట్లోనూ కొయ్యపప్పు వేయవలసిందేనా?" అని అడిగింది.

"కొయ్యపప్పా! ఎందు కొద్దూ? ఎవరన్నా విధవలొస్తున్నారేమిటి?"

శైల మైదాలో కొయ్యపప్పు కలుపుతూ అన్నది:—"ఇంటిప్పట్లో కాస్త ఇంగువకూడా వేస్తే, భలే బాగుంటుంది, అత్తయ్యా! మా నాన్న ఇంగువలేంది ఏదీ తినడు. ఆ ఇంగువకూడా బజార్లో దనుకున్నావా? అఫ్ఘనిస్థానంనించి కాబూలీవాళ్ళు తెచ్చింది తప్ప వాడనివ్వడు."

"ఆ దేశం మంచిదమ్మా! ఇక్కడ పల్లెటూళ్ళల్లో ఏమి దొరికి చస్తుయ్!"

"అక్కడకూడా అది బజార్లో దొరకదు. కాబూలీవాళ్లు సొంతానికి తెచ్చుకుని నాన్నకిచ్చి పోతూఉంటారు. ఒకళ్ళు కాదు, ఎంతోమంది. అప్పాలు సప్పాలకు వస్తూ ఉంటారా, ఇచ్చిపోతారు. ఒక్క ఇంగువే కాదు, బాదంపప్పూ, ఆల్‌బకరా, పచ్చిద్రాక్షా, బుట్టలకు బుట్టలు! మే మైదుగురిమి ఎన్నని తినగలము—కుళ్ళిపోయేవి!"

"అదిగో మొదలెట్టింది!" అంది గౌరి పక్క ఇంట్లోనించి.

అంటే, కన్నవారిని పొగడటం అన్నమాట. నిజానికి

శైలలో ఉన్న లోపమిదే. వినయంలోనూ, విధేయతలోనూ, ప్రవర్తనలోనూ ఆమెకుసాటి ఆ గ్రామంలో లేరు. అయితే కన్నవారింటితో పోల్చింది ఏమాటా చెప్పదు.

పొరుగింటో గోలగాఉంది. అత్తా కోడళ్లు పోట్లాడు కుంటున్నారు "ఏదెలాఉంటేనేం, నాకుమాత్రం మంచి కోడలు దొరికింది. ఎదురుచెప్పి తేకదా ఏమన్నా అంటానికి! ముఖంవంకచూస్తే జాలేస్తుంది," అన్నది అత్త.

"వాళ్ళబ్బాయి భార్య నెందుకోప్పడడు? మాఅన్నయ్య అయితేనా అత్తయ్యా, కొంపమునిగేది! వెంటనే పుట్టింటికి పంపేవాడు. ఒకమాటు మావదినె అమ్మతో వాదన వేసుకుంది. ఆనేరానికే మాఅన్నయ్య మూడునెల్లు వదినెతో మాట్లాడలేదు! ఆఖరికి మా అమ్మే బతిమాలి రాజీచేసింది. మా అన్నయ్యది భలే పట్టుదల—మోకాళ్ళపైకి కడతాడు ఖద్దరుపంచ; మోచేతులవరకు లాల్చీ; చుట్ట, బీడీ, సిగరెట్టు—ఏదీ కాల్చడు!" అన్నది శైల.

అత్త బహుశా లోలోపల విసుక్కున్న దనుకుంటాను. —"చాలు, చాలు. చేతులు కాస్త త్వరగా ఆడనియ్యి. వేళవుతున్నది." అన్నది.

శైల పిండికలిపిఇచ్చి, చేపలుకోస్తూఅన్నది: "అత్తయ్యా! ఇక చిన్న చేపలు కొనమాకండి. మా అమ్మ రెండుమళ్ళకు తరుగుండే చేపను ఇంటోకి తేనిచ్చేది కాదు. వాలగలూ—"

"ఇకచాలులే, అంతటితో. దబ్బున కోసేసి తలదువ్వుకో, పో!" అన్నది అత్త మధ్యనే.

*　　*　　*

శైల తల దువ్వుకుని దుస్తులు మారుస్తున్నది. ఆడుబిడ్డ గౌరి ప్రశంసాదృక్కులతో వదినెవంక చూసి — "అబ్బో ఏమి రంగు ఒదినా నీది! నువ్వు ఏది వేసుకున్నా ఎంత, చక్కగా అతుకుతుంది. నన్ను చూడూ, ఆరిన కొరివల్లే—" అన్నది.

"ఇదిఇచ్చేదికాదు గౌరీ, లేకపోతే నీకిచ్చేదాన్నే. అసలు నా దాక ఎరుపా! మా నాన్ననూ, అమ్మనూ, అన్ననూ, అక్కయ్యలనూ చూడకపోతివి-ఎరుపంటే ఎలా ఉంటుందో తెలిసేది! గులాబిపువ్వు—"

"ఏమిటి, ఒదినా! వాళ్లు నీకంటేకూడా ఎరుపా?" అన్నది గౌరి విస్మయంతో.

"ఆ, గౌరీ! ఆ ఇంటోకెల్లా నేనే నలుపు."

"ఇంకా ఎంత ఆలస్యముంది, పిల్లా! వారంతా వచ్చి కూర్చున్నారు" అన్నది అత్త మెల్లిగా అక్కడికి వచ్చి.

శైల దడబిడగా కొంగు తలమీదికి లాక్కుని "అయిపోయిందత్తయ్య! వచ్చేస్తున్నాను" అని అతిథినులుండే చోటికి పోయి నవ్వుముఖంతో నమస్కరించింది.

ఆమె చక్కదనానికి, వచ్చినవారంతా ముగ్ధులై పోయారు. అతిథినుల విలువగల దుస్తులూ, పౌడర్లూ శైలముందు కొరగాకుండా పోయినవి. చుక్కల్లో చంద్రుడు లాగా ఉంది శైల. "ఇంత చక్కనికోడల్ని ఎక్కడ సంపాయించావు అక్కా! చదువుకూడా వచ్చా?" అన్నది వచ్చినావిడ.

"స్కూల్లో చదువుకోలేదు—మా నాన్నకు స్కూల్లో చదివించడం ఇష్టం లేదు. ఇంటోనే చెప్పించారు. మెట్రిక్ స్టాండర్డుదాకా చదివాను. తర్వాత-" అని ఊరుకుంది శైల.

మాట పూర్తి కాకపోయినా ఇంగితం తెలిసింది అందరికీ.

"ఏమోనమ్మా, ఈ కాలమేమిటోకాని కాలేజీ చదువు లేంది, ఆడపిల్లలకు పెళ్ళిళ్లు కావటంలేదు. మా కోడళ్లు అంతా కాలేజీలో చదువుకున్నవాళ్లే. పెళ్లికాగానే మాని పించాము." అన్నది వచ్చినావిడ.

శైల—"కాలేజీకెళ్ళకున్నా నేనుకూడా కొంత చదివాను. కాని మాఅక్కయ్యలు ఇంకా బాగా చదివారు. మా అన్న య్యకి చదవటమన్నా చెప్పటమన్నా భలే పిచ్చి. ఏడాదికి కనీసం అయిదువందల రూపాయలు పుస్తకాలైనా కొనే వాడు—ఇంగ్లీషువీ, బెంగాలీవీ. పనిపాట లేమీ చేయడు. ఎప్పుడన్నా మాఅమ్మ, ఏదన్నాబిజినెస్ చేయమంటే 'ఏమి బిజినస్ చేసేదమ్మా ఈ జ్ఞానసముద్రం వదలి,' అని పుస్త కాలు చూపించేవాడు."

"మీ కన్న వారి దే వూరు?"

"అలహాబాదు. మూడుతరాలయింది అక్కడికిపోయి. నాన్న కంట్రాక్టరు."

"వరుమానం"

"నాకు బాగా తెలియదండీ! కాని, మా రెండో అన్న అప్పుడప్పుడు మా అమ్మతో—"ఈ పాత డాబాలో ఎందుకమ్మా పడి ఉండటం, కొత్తగా కట్టించిన నిక్షేపం లాంటి మేడ అద్దెకిచ్చుకుని? నాన్నతో చెప్పు, ఆ ఇంటికి వెళదామని" అని అంటూ ఉంటాడు. మా నాన్న 'ఇది పెద్దలు కట్టించినయిల్లు. దీన్ని నేను వదలిపెట్ట' నని అంటాడు. అసలు దాన్ని బాగుచేయించడు కూడా. ఎవరన్నా కారు

కొనుక్కోరాదా అంటే 'కుర్రవాళ్ళకి దర్జా బలుస్తుంది. ఏదో నేనున్నానుకాబట్టి కంట్రాక్టులుచేసి సంపాదిస్తున్నాను. నేను దాటిపోతే వీళ్లు ఎందునా కాకుండా చెడిపోతా'రని అంటాడు. పాత గుర్రపుబగ్గీ వదిలిపెట్టడు. మా నాన్నను స్నేహితులు ఏమంటారనుకున్నారు—!'' అని శైల మంద హాసం చేసింది.

వచ్చినావిడ శైల అత్తతో అన్నది: ''అయితే, అబ్బా యికి పెద్ద సంబంధమే తెచ్చారన్నమాట, మీకంటే చాలా భాగ్యవంతులు! పెట్టుపోతలుకూడా బాగా జరుపుతారా?''

విచిత్రప్రపంచమూ, విచిత్ర ప్రజలూ. ఏ మాట ఎవరి మనస్సును నొప్పిస్తుందో దేవుడికికూడా తెలియదు. 'మీ కంటే చాలా భాగ్యవంతులు!' అన్న మాట, శైల అత్తకు చాలా అవమానకరంగాతోచి ముఖం మాడ్చుకుని అన్నది:– ''ఏమో నమ్మా! మాకంటే భాగ్యవంతులో బీదవాళ్లో తెలి యదు. ఇక పెట్టు పోతలా అమ్మాయి రెండేళ్ళయింది కాపు రానికి వచ్చి. ఒక్క పండగకైనా పిలిచిన పాపాన పోలేదు!''

శైల వెంటనే అందుకున్నది:—'ఎందుకనో తెలును నాండి! మా నాన్న చిత్రమైన మనిషి! అంటాడు గదా— 'ఒక వస్తువును దానంచేసిన'తర్వాత మళ్ళీ నాదని ఎందుకు తీసుకొచ్చుకుంటాను! నా దగ్గర పుచ్చుకున్న మనిషి మళ్లీ తీసుకొస్తే, అప్పు డాదరిస్తాను, గౌరవిస్తాను. నా దని చెప్పు కుంటాను' అని. ఇక పెట్టుపోతలు జరపటం, మంచిసెబ్బరలు చూడటం, అంత దూరానున్నాక ఎలా అమరుతుంది? కాని

డబ్బు కావా లంటేమాత్రం వందా, యాభై పంపుతూ ఉంటాడు.''

''ఏ మన్నావు పిల్లా! మీ నాన్న మాకు డబ్బు పంపుతూఉంటాడూ—ఎప్పుడూ? ఏనాడూ?'' అంది శైలఅత్త.

''మీ సంగతి చెప్పలేదు, అత్తయ్యా! ఇంకా వారి నడిగి చూడు, వందా, యాభై అడగంగానే పంపుతారో లేదో, ఎందుకు పంపడు?''

అత్తముఖం నల్లబడింది. ఈ వూరివారే కాదు, పొరుగూరివారుకూడా ఈ మాట విన్నారు. ఇక దేశంమీద పాకటం ఎంతకాలం పడుతుంది? అమరుని తల్లికి తల కొట్టి వేసిన ట్లుంది:—''సరే, అమరుణ్ణి రానియ్యి, నే నడిగి చూస్తాను. అస లింతవరకు నాకీ సంగతే తెలియదే!''

''మీకు చెప్పలేదు కాబోలు, అబ్బాయి. ఏదో అవసరం వచ్చి ఉంటుంది—మామ దగ్గరనుంచి తెప్పించుకుని ఉంటాడు'' అన్నది ఒకావిడ.

''ఎందుకు తెప్పించుకుంటా డమ్మా! ఆ పని నీచమైందని వాడికి తెలియదూ?—ఛీ, మామదగ్గర చెయ్యి చాచటమా!'' అన్నది శైలఅత్త.

*　　*　　*

అమరుడు కలకత్తాలో కమీషన్ వ్యాపారం చేస్తూ ఉంటాడు. వ్యాపారం కొద్దిదయినా స్వతంత్రుడు. మాసానికి రెండుసార్లయినా ఇంటికి వచ్చి పోతూ ఉంటాడు. అమరుని తల్లి రోషకషాయిత నేత్రాలతో కొడుకు రాకకోసం ఎదురు చూస్తూ ఉన్నది.

ఆ వేళ ఇంటికి వచ్చిన అతిథులదగ్గర జరిగిన పరాభవం అమరునితల్లి మరిచి పోలేకుండా ఉన్నది. ఆ నలుగురిదగ్గర తన సంసారం వేలుమీద ఎండ వేసిన ట్లయింది. తను ఝూటా క్కోరు అయింది. అమరుని తల్లి అప్పటినించి ఇప్పటివరకూ కోడలితో మాట్లాడ లేదు. శైల మామూలుగా నవ్వు ముఖంతో ఆజ్ఞలకోసం అత్తదగ్గరిగి వస్తూనే ఉన్నది.

కాలం, నిప్పుయొక్క వేడిని తగ్గిస్తుంది; మనస్సులోని జ్వాలనుకూడా చల్లారుస్తుంది — ఇది ప్రపంచ నియమం; కాని, శైల దురదృష్ట మేమిటో, అత్త హృదయజ్వాల తగ్గటానికి బదులు హెచ్చింది. కారణం, ఆ మంటకు వంటచెరకు తోడయింది—ఇరుగు పొరుగు అమ్మలక్కల ఊసుపోని మాటలనే!

ఆ వేళ నీళ్ల రేవు దగ్గర తన ఇంటి సంగతులు ఊళ్ళో స్త్రీలు చెప్పుకోటం, శైలఅత్తె స్వయంగా విని వచ్చింది! అమరుడు రెండురోజుల్లో వస్తున్నా నని ఉత్తరం రాశాడు. ఈ వార్త తెలిసేవరకు శైలకు మిన్నువిరిగి మీద పడ్డట్ట యింది. ఉత్తుత్తనే అలా చెప్పానని, భర్తకు ఉత్తరం రాద్దామనుకున్నది. కాని ఆమెకు చెయ్యాడ లేదు. పెద వులు కంపించినై. కళ్లల్లో నీరుకూడా తిరిగింది—కాగితం నలిపి అవతల పార వేసింది.

శైల పడకగదిలో స్తబ్ధుగా కూర్చున్నది — అమరుడు రాగానే కాళ్లమీద పడదామని. హఠాత్తుగా అమరుని కేకలు విని చకితురాలైంది. ఎవరిమీద ఈ కేకలు?— మెల్లగా, దొంగ మాదిరిగా బయటికి వచ్చింది చీకట్లో.

కొంచెం గుండె దిటవు కలిగింది; కేకలు కూలివాడిమీద!

"అరమైలు ఉందో లేదో—అర్ధమణుగు బరువుకి బేడ ఇస్తే ఇంకెం తివ్వాలి?"

కూలీ వదిలేరకం కాదు?—"అప్పుడే ఎందుకు చెప్ప లేదు బేడని? ఏయ్ కూలీ ఇధర్ ఆవ్! అని హుకుమ్ చలా యిస్తిరే. నేను మూడణాలకి తక్కువ తీసుకోను."

"పో తొత్తు కొడకా! నీ మొఖం నాకు చూపించ మాకు!" అని ఇంకో అణా అవతల పారేసి అమరుడు సణు క్కుంటూ ఇంటోకి వచ్చాడు:—"చూడు, కరువులోనే అధికమాస మన్నట్టు, ఒక ముండాకొడుకు యాభై రూపా యలు ఎగవేసి పోయె, స్టేషను కొస్తే బండి అందక పోయె! ఇక యింటి కొస్తే అణా దండ గాయె!"

తల్లికూడా సమయానికి వేచి ఉంది. శాంతంగా, కాని, శ్లేషగా—"డబ్బుకోసం నీ కేం దిగులు నాయనా? మామ గారుండె, దాత, అడగగానే పంపుతాడు!" అన్నది

మాట పూర్తిగా అర్థం కాకపోయినా శ్లేష అమరుని బాగా నొప్పించింది. కనుబొమలు చిట్లించుకొని "అంటే?" అన్నాడు.

"అందుకే నీకోసం ఎదురు చూస్తున్నారురా! నాకు నీ సంపాదనతో అన్నం పెడుతున్నావా, లేక మీ మామ పంపిన డబ్బుతో పిండంవేస్తున్నావా? వందా, యాభై నీకు కావలసినప్పుడల్లా మీ మామ పంపుతూ వుంటా డటగా?"

అసలే అమరుడు విసుగ్గా ఉన్నాడు. ఈమాటలు అతన్ని ఉడికించినవి. "ఏ ముండా కొడు కన్నాడు?" అన్నాడు.

“నీ పెళ్ళామే!”

శైలకు ప్రపంచమంతా తల్లకిందు లౌతున్నట్టు తోచింది. ఏమి చేయాలో, ఏమి అనాలో కూడా స్థిరపరచుకో లేక పోయింది. అత్త అడిగింది. “ఊరుకున్నావేం, జవాబివ్వ?”

“నాన్న ఇస్తాడుగా” అన్నది శైల తనకు తెలియకుండానే.

అమరునికి తల కొట్టివేసినట్టయింది. పిచ్చివానిలాగా తల స్తంభానికేసి కొట్టుకోబోయాడు. తల్లి వచ్చి పట్టుకున్నది.

“అది ఇంట్లో ఉంటే నేను నీళ్ళుకూడా తాగను.” అన్నాడు అమరుడు.

“నిజమే నాయనా! నేనూ దాన్ని పెట్టుకుని కాపురం చేయలేను. నలుగురిలోనూ నాకు తలవంపులు తెచ్చింది.” అన్నది తల్లి.

* * *

విచారణ చేసేవాడు, క్రమంగా నడవకపోతే న్యాయం జరగదు—అత్యాచారం తప్ప! అందుచేతనే శైల యొక్క ఈ చిన్న తప్పుకు పెద్దదండన విధింపబడింది. ఆరాత్రి పన్నెండు ఘంటల బండికే శైలను కన్నవారింటికి పంపివేశారు,

కూతుర్ని చూడగానే శైలతల్లి ఆనందంతోనూ, విస్మయంతోనూ, పొంగిపోయింది... “ఏమే శైలీ, హఠాత్తుగా వచ్చావు?” అన్నది.

శైల ఊటమింగి—“రాకూడదా? మీరు తీసుకురాకపోతే నేనే వచ్చాను” అన్నది.

తల్లి కుమార్తెను కావిలించుకుని—“నిన్ను పిలిపించనందుకు నాకు కష్టంగా లేదటే! కాని నన్నేమి చేయమం

టావో చెప్పు ?'' అని కాసేపుండి నిట్టూర్చి మళ్లీ అన్నది!
''నాన్నగారి వ్యాపారం చాలా తగ్గిపోయింది — పోటీలు ఎక్కువైనై! పైగా హైమ పెళ్లికి ఎదిగి కూర్చున్నది— చేతిలో డబ్బాడటం లేదు తల్లీ!''

శైలకు అవకాశం దొరికింది, భోరున ఏడ్చింది.

''వెంట ఎవరొచ్చారే శైలీ, అల్లుడుగారేనా ?''

''ఊహు, మరిదిగారొచ్చారు'' అన్నది శైల వెలవెల పోయిన ముఖంతో.

''ఏరే ? బయ టెందుకు వదలిపెట్టి వచ్చావు?—రామీ, శైల మరిదిగారు బయటున్నారట, లోపలకు పిలుచుకురా! —అమ్మగారు పిలుస్తున్నారని చెప్పు.''

శైలకు గుండెల్లో రైళ్లు పరుగెత్తుతున్నవి. వాళ్ల ఇంటో నీళ్లుకూడా తాగవద్దని అమరుడు తమ్మునికి ఆజ్ఞాపించాడు— ఒట్టుకూడా వేశాడు.

''ఎక్కడమ్మా, ఎవ్వరు లేరే!'' అన్నది దాసీది వచ్చి.

తల్లికి ఆశ్చర్యం వేసింది. ''అదేమిటే? ఎక్కడ కెళ్ళాడు ?'' అన్నది ఆశ్చర్యంతో.

''బండికి అందుకోవాలి, అందుకని త్వరగా వెళ్ళారు.'' అన్నది శైల.

తల్లికి ఇంకా ఆశ్చర్యం వేసింది. ''బండికి అందుకో వాలా—వెళ్లిపోయారా—అంటే ?'' అన్నది.

''ఆయనకి సిమ్లాలో అవసరమైన పని ఉంది. టిక్కెట్టు కూడా తిన్నగా తీసుకున్నారు. మే మొచ్చిన బండిలోనే వెళ్లుతారు.''

తల్లి కొంచెం తృప్తి పడింది. 'మళ్ళీ వెళ్ళేటప్పుడైనా దిగుతాడా?''

శైల నిట్టూర్చి అన్నది. ''దిగుతా నన్నాడుగాని నాకు నమ్మకం లేదు. చాలా అవసరమైన పని! అక్కడ ఒకరి దగ్గర ఉత్తరంతీసుకుని కలకత్తా వెళ్లాలి. సమయానికి అందు కోకపోతే అంతా వృథా!''

ఈ సమయంలోనే శైల పెద్ద అన్న, జ్ఞానసముద్రుడు— వచ్చాడు. అతను వేసింది ఖద్దరే కాని మోటుది కాదు. జరీ కమ్ముల ధోవతీ, సన్నని లాల్చీ తొడిగాడు, నోట్లో గోల్డు ఫ్లాక్ సిగరెట్టు; చేతిలో గాలం. చెల్లెలిని చూడగానే ''అరే! ఎప్పుడొచ్చావే, శైలీ?'' అన్నాడు.

''ఇంతకుముందే అన్నయ్యా! కులాసా?'' అన్నది శైల.

''ఆఁ—సరేగాని, ఇవ్వాళ నువ్వు కూర వండాలి. మూడేళ్లనుంచి బెంగాలులో ఉన్నావు, ఎట్లా వండుతావో! ఫస్టు క్లాసయిన చేపలు తెస్తాను!''

శైల అన్న చేతిలోనుంచి గాలం తీసుకుని అన్నది: ''రా అన్నయ్యా ఒకమాటు మా ఊరు, ఎంత పెద్ద చేపలు పట్టుతావో చూస్తాను!''

''మీవైపున చెరువుల్లో పెద్ద పెద్దచేపలు ఉంటాయికాదటే?''

''ఒక్కొక్కటి మణుగూ, రెండు మణుగులూ! మీరు నమ్మరుగాని, అన్నయ్యా! నేను మొదట కాపరానికిపోయి నప్పుడు ఆ చేపల్ని చూసి భయపడ్డాను — ఒకనాడు మా మరిది పెద్ద వాలగను చూపి భయపెట్టాడు. ఇప్పుడెంత దైనా నాకు భయంలేదు—పరపర కోసివేస్తాను.''

"రావాలని ఎన్నోసార్లు అనుకుంటాను గాని, పడటం లేదే! కలకత్తా వెళ్ళితే అమరబాబుని చూడటానికే కుదర లేదు. నువ్వుగనక కలకత్తాలో ఉంటే తప్పక వచ్చేవాణ్ణి!"

"అదే చూస్తానుగా, కలకత్తాలో మా ఇల్లు—"

"ఏమిటీ? కలకత్తాలో ఇల్లు కట్టుతున్నారేమిటి?"

"చోటుకొన్నాము. నిమ్మళంగా తయారవుతుంది!"

తల్లి పులకితురాలైంది. "అల్లుడు బాగా ఆర్జిస్తున్నాడంటే, శైలీ!" అన్నది.

శైల తలవంచుకొని—"ఊళ్లోకూడా ఇంకో అంతస్తు వేయిస్తారు" అన్నది.

*　　　*　　　*

రెండుమాసాలు గడిచినా, అల్లుడి దగ్గరనుంచిగానీ, వియ్యపురాలి దగ్గరనుంచి కానీ ఉత్తరం రాకపోవటం చూసి శైలతల్లి అనుమానపడింది; అత్తవారికీ శైలకూపొరపొచ్చాలొచ్చి ఉండవచ్చునని ఊహించి భర్తను వియ్యపురాలికి ఉత్తరం రాయమని అడిగింది.

మహేంద్రబాబు చాలా పెద్దమనిషి. శైల, ఇతరుల విషయంలోనూ, ఆస్తిపాస్తుల విషయంలోనూ అతిశయోక్తులు చెప్పినా, తండ్రినిగురించి చెప్పిందిమాత్రం యథార్థం. ఆయన ఆ నాడే వియ్యపురాలికి ఇలా ఉత్తరం రాశాడు :

"శైలకు తమ ఇంటో తావిచ్చి అనుగ్రహించారు! కృతజ్ఞుడను. ఆ అనుగ్రహము చిరకాలము ఉండుగాక, అని ప్రార్థిస్తున్నాను. అక్కడ ఏమి జరిగిందో, శైల ఏమి తప్పు చేసిందో నాకు అర్థం గాకుండా ఉన్నది! కాని, ఏదో తప్పు

చేసి ఉంటుందని నేను గట్టిగా నమ్ముతున్నాను. శైల ఏమీ బయటపెట్ట లేదు! తమరు ఈ రెండు స్థానాలమధ్య ఆశీర్వాదం పంపలేదు! చిరంజీవి అమరుడుకూడా ఉత్తరం వ్రాయలేదు. దయఉంచి అక్కడ ఏమి జరిగిందో తెలిపితే-నేను స్వయంగా శైలను వెంటబెట్టుకొని వచ్చి తమ పాదాలదగ్గర పడవేస్తాను.''

చివర ఈ పంక్తులుకూడా కలిపాడు——

''అమరుని దగ్గరనుంచి కబురు రాకపోయినా శైల ద్వారా అతని పురోభివృద్ధి విని సంతసించాను. కలకత్తాలో ఇల్లు కట్టిస్తారని తెలిసి చాలా ఆనంద పడ్డాను. రెండో అబ్బాయి పరీక్షసంగతికూడా విన్నాను. నాలుగు మార్కులు తక్కువగా రావటంవల్ల మొదటివాడుగా రాలేక పోయినా డట. ఈ మాటు బి. ఏ., లో తప్పక రాగలడని ఆశీర్వదిస్తున్నాను.''

ఉత్తరం చదువుకునేవరకు అమరుని తల్లికళ్ళవెంట నీళ్లు కారినవి. ఇదివరకు మనసులో జ్వలిస్తున్న క్రోధాగ్ని, శైల ఎదట లేకపోవటంచేతనూ, కాలయాపన కావటంవల్లనూ చల్లారిపోయింది. ఆమెకు అనుక్షణమూ ప్రతిమలాంటి శైల నవ్వుముఖం కనిపించసాగింది. అబద్ధాలయితే ఏం——శైల తియ్యనిమాటలు ఆమె చెవిలో ప్రతిధ్వనించ మొదలిడినవి. ఇక, ఈ ఉత్తరం ఆమెలో కాస్తాకూస్తా మిగిలివున్న కోపాన్ని పోగొట్టింది. ఉత్తరంలో చివరిభాగం, 'కలకత్తా ఇల్లు...' వగైరాలున్న భాగం రెండుమూడుసార్లు చదువుకున్నది. అమరునికి ఉత్తరం రాసి, వియ్యంకుడికి ఇలా రాసింది:

"కోడలు మా ఇంటికి లక్ష్మి; లక్ష్మివల్ల ఏమి తప్పు ఉంటుంది? పని తొందరలో ఉంటంచేత ఉత్తరం రాయలేక పోయాను, ఆ తప్పు మాదే. త్వరలోనే అమరుడు అమ్మాయిని తీసుకురావటానికి వస్తాడు."

ఉత్తరం చూసి శైల పులకితురాలైంది. వెంటనే భర్తకు ఉత్తరం రాసింది.

అమరుడు వచ్చాడు. వెంట పదిసేర్ల బరువున్న చేపను కూడా తెచ్చాడు.

శైల దాన్ని ఇంట్లోకి తీసుకుపోయి తరుగుతూ అన్నది. "పెద్ద చేపలు పడలే దనుకుంటాను. ఇది మధ్యరకమే!"

"మొదలుపెట్టా, అత్తగారి ఐశ్వర్యాన్ని పొగడటం!" అన్నది వదిన.

* * *

రాత్రి శైల అమరునిదగ్గర తలవంచుకు నిలబడింది. అమరుడు జేబులోనుంచి శైల రాసిన ఉత్తరం తీసి అన్నాడు "ఏమి టిదీ? 'ఎలాగైనా సరే సాధించి పెద్ద చేపను పట్టుకు రండి. మనకు పెద్దపెద్ద చేప లున్నవని ఇక్కడ చెప్పాను. మనకు చిన్న గుంట అయినా లేదే, చేప లెక్కడనుంచి వస్తాయి? పైగా—'ఇక్కడ మాయముత్యాల పేర్లు అంతా వేసుకుంటున్నారు: వచ్చేటప్పుడు నాకుకూడా ఒకటి పట్టుకు రండి' అని రాశావు. అదేమిటి?—ఆఁ—ఏడుస్తావెందుకు?'

శైల పక్కమీద పడి వెక్కివెక్కి ఏడ్చింది. భర్త అడిగినదాని కింకేమని సమాధాన మిస్తుంది!

(తారాశంకర బెనర్జీ)